

# గ్రంథాలయసర్వస్వము.

ప్రతిమాసమునను సచిత్రముగ వెలువడును


సంపు. ౯ ] బెజవాడ ఏప్రియల్ ౧౯౩౫ [ సంచిక ౨



అయ్యంకి వేంకటరమణయ్య

సంపాదకుడు





వాయువు ఎల్లవారికి ఎట్లు స్వాధీనమై యున్నదో
జ్ఞానముకూడ అట్లు స్వాధీనము కావలయును
ఉదకము ఎల్లవారికి ఎట్లు సేవ్యమై యున్నదో
జ్ఞానముకూడ అట్లు సేవ్యము కావలయును
సూర్యచంద్రమండలముల తేజస్సు ఎల్లవారికి
ఎట్లు సౌఖ్యప్రదముగా నున్నదో అట్లే
జ్ఞానముకూడ సౌఖ్యప్రదము కావలయును

-చిలకమర్తి లక్ష్మీనరసింహము


వార్షికమూల్యము: సభ్యులకు రు ౩

ఇతరులకు రు ౫ విడిసంచిక పావలా

# బెజవాడ సరస్వతీ బుక్‌డిపోవారి స్వంత ప్రచురణములు.

ఆంధ్రదేశమున ప్రదర్శింపబడు నాటకములు.

| | రు. | అ. |
|---|---|---|
| సతీ సక్కుబాయి సో॥ రా॥ | 0 | 12 |
| శ్రీకృష్ణతులాభారము ము॥ సు॥ | 1 | 0 |
| సత్యహరిశ్చంద్రీయము బ॥ ల॥ | 1 | 0 |
| బుద్ధిమతీ విలాసము డిటో | 1 | 0 |
| రంగూన్ రౌడీ సో॥ రా॥ | 1 | 0 |
| ధరణీకోట డిటో | 1 | 4 |
| సతీ అనసూయ డిటో | 1 | 0 |
| గంగావతరణము డిటో | 1 | 0 |
| మహాభక్త విజయము డిటో | 1 | 0 |
| ద్రౌపదీ వస్త్రాపహరణము మ॥ అ॥ | 1 | 0 |
| సావిత్రి శ్రీ॥ స॥ | 1 | 0 |
| చింతామణి కా॥ నా॥ | 1 | 0 |
| మధుసేవ డిటో | 1 | 0 |
| పత్నీప్రతాప్ అను అనసూయ సో॥ అ॥ | 1 | 0 |
| రాధాకృష్ణ పా॥ ల॥ | 0 | 12 |
| పాదుకాపట్టాభిషేకము పా॥ ల॥ | 1 | 4 |
| జయంతజయపాలము ఆ॥ స॥ | 0 | 12 |
| కృష్ణలీల బళ్లారి కే॥ సు॥ | 1 | 4 |
| రామదాసు డి॥ గో॥ | 1 | 0 |
| రసపుత్రవిజయం ఇ॥ యు॥ | 1 | 0 |
| రాణాప్రతాప్‌సింగు డిటో | 1 | 0 |
| చంద్రగుప్త సం॥ శి॥ | 1 | 0 |
| దుర్గాదాసు జం॥ శి॥ | 1 | 4 |
| రాణాప్రతాపసింహ డిటో | 1 | 0 |
| రాధాకృష్ణ సాంగ్సు చం॥ శే॥ | 0 | 12 |
| తులాభారంసాంగ్సు డిటో | 0 | 12 |
| చండిక నాటకం ము॥ వే॥ | 1 | 0 |

ఆదిభట్ల నారాయణదాసుగారి హరికథల

| | రు. | అ |
|---|---|---|
| జానకీశపథము | 1 | |
| రుక్మిణీకళ్యాణము | 0 | 1 |
| మార్కండేయ చరిత్రము | 0 | 1 |
| హరిశ్చంద్రోపాఖ్యానము | 0 | 1 |
| అంబరీష చరిత్రము | 0 | |
| ప్రహ్లాద చరిత్రము | 0 | |
| గజేంద్రమోక్షము | 0 | |
| భీష్మచరిత్రము | 0 | |
| పైన ఉదహరించిన 8 పుస్తకములు కలిసిన క్యాలికోబైండు | 5 | |

బి. బాలాజీదాసుగారిహరికథలు.

| | | |
|---|---|---|
| గయోపాఖ్యానం | 0 | |
| జయప్రదాదేవిచరిత్ర | 0 | |
| నలచరిత్రము | 0 | |
| రుక్మాంగద చరిత్రము | 0 | |
| కుశలవ విజయము | 0 | |
| శశిరేఖాపరిణయము | 0 | |
| సంగ్రహరామాయణము | 1 | |
| దయాకర విజయము | 0 | |
| త్రైశంకు విజయము | 0 | |
| సీతాకళ్యాణము | 0 | |
| ద్రౌపదీ మానసంరక్షణం | 0 | |
| కుచేలోపాఖ్యానం | 0 | |
| పురందరదాసు చరిత్ర | 0 | |
| హరికథేతిహాసమంజరి భా 1 | 0 | |
| డిటో రెండవభాగము | 0 | |

 మావద్ద అనేకరకములు గలవు. కోరినవారికి సూచీపత్రము లెట్లాగు ఉచితముగా పంపబడును.

వలయువారు:—కురుకూరి సుబ్బారావు, ప్రొప్రయిటరు, సరస్వతీ బుక్‌డిపో, బెజవాడ

## గ్రంథాలయోద్యమ సేవకులు



మారేపల్లి రామచంద్రశాస్త్రిగారు

వీరి షష్టిపూర్తి మహోత్సవము జరుగబోవనున్నది.

గ్రంథాలయం




పరబ్రహ్మాత్మికాం దేవీం భుక్తిముక్తిఫలప్రదాం,
ప్రణమ్య నౌమి తామేవ జ్ఞానశక్తిం సరస్వతీమ్.

౯-వ సంపుటము.

# గ్రంథాలయ సర్వస్వము.

౨-వ సంచిక.

ఏప్రియల్ 1935


## నిరక్షరులకు చేయవలసిన సేవ.

(ఆంగ్లమున యస్. ఆర్. రంగనాథనుగారిచే వ్రాయబడిన వ్యాసమునకు డి. కృష్ణయ్యగారి ఆంధ్రీకరణము)

మన దేశమున గ్రామజీవితమే ముఖ్యమనుట సత్యము. అనేక పాశ్చాత్య దేశములలో నూటికి 40 వంతు ప్రజలు పట్టణములలో నివసించుచు గ్రామవృత్తుల నభ్యసించుచుండ మన దేశమున 89 వంతు గ్రామజీవనులై యున్నారు. అందువలన ఒక్కొక్క ముఖ్యవిషయమునందును మనకును తదితర దేశములకును భేద మెక్కువ.

గ్రంథాలయోద్యమమున ముఖ్యముగ మన దేశమున నీ యుద్యమము గ్రామసమ్మతముగ నుండవలయును. పాశ్చాత్య దేశములలో నట్టి భాగముల కట్టి యుద్యమ మావశ్యకమో చాలకాలము క్రిందటనే నిర్ణయింపబడినది. కాని అట్టి పద్ధతులనే మన దేశమున జొనిపి గ్రంథాలయోద్యమము తృప్తికరముగ పని చేయుచున్నదని యూహించు అపాయము నేడు మన కున్నది. ఇంతకంటె నెక్కుడు మోసకరమైన విషయము వేరుండదు.

### నిరక్షరులకు చేయవలసిన సేవ.

పాశ్చాత్య దేశములలో గ్రామములకై నియమించిన గ్రంథాలయ సూత్రములనే యథావిధిగ మన దేశమున ప్రవేశపెట్టుటకు వీలు లేదు. గడచిన 50 సంవత్సరములుగనుండు నిర్బంధవిద్యావిధాన మా దేశీయుల నక్షరస్థులుగ జేసినది. 1981 వ జనాభాలెక్కల ప్రకా

రము కూడ మన దేశమున అక్షరస్థులసంఖ్య నూటికి 8 కంటెను అధికము కాలేదు. గ్రామ గ్రంథాలయ సమస్యను క్లిష్టతరము నదిదియే. అక్షరస్థులకై యేర్పాటు లొనరించుచు నిరక్షర కుక్షులను విడిచిపెట్టిన గ్రంథాలయోద్యమ తత్వము ఆలోచనరహితమైనదని చెప్పక తప్పదు. అట్లు నిరక్షరులను విడిచిపెట్టుటవలన ఈ యుద్యమమునకు సిగ్గును జేకూర్చుటే గాక జాతీయాశయములకును హానికరముగ నుండును. ఇప్పటికే అక్షరస్థులకును నిరక్షరులకును గల వ్యత్యాసము మన దేశములోని అన్ని అంశముల అభివృద్ధికిని అంతరాయముగ నున్నది. మన దేశమున అక్షరస్థులు కొద్దిమంది మాత్రమేను. నిరక్షరులు తండోపతండములుగా నున్నారు. మన దేశమున కాయువుపట్టనదగు విద్యావంతు లాంగ్లేయవిద్యాప్రచారకు లగుటవలనను, దానినే సర్వవిధముల వాడుచు నిరక్షరులసంగతి విచారింపనందునను, ప్రాచీనవిద్యాపద్ధతుల నభ్యసింపనందునను నిప్పటికే ఈ వ్యత్యాస మెక్కువగ నున్నది.

వాచకపద్ధతి.

గ్రామగ్రంథాలయోద్యమమున కృషిచేయు భాషాసేవకులు తాత్కాలిక పద్ధతిగ ఒకతరమువరకైన ఈ పద్ధతి నభ్యసించి భయంకరముగ నుండు నీ నిరక్షరసమస్యను నిర్మూలించుట యుక్తము. పాశ్చాత్య దేశములో గ్రామగ్రంథాలయ ప్రియులు గ్రామస్థులకు పుస్తకముల నిండ్లకిచ్చి వారిని జదువునట్టుగా జేయుట ముఖ్యకర్తవ్యమై యుండ మన దేశములో పల్లెటూరి యుపాధ్యాయుడీ నిరక్షరుల నందరిని—స్త్రీ పురుషులను బీదవారిని, భాగ్యవంతులను, పిన్నపెద్దలను ఒక్కచో జేర్చి పల్లెటూరి పాఠశాలయందో, దేవాలయమునందో, గ్రామోద్యోగుల నివాసస్థలములందో, వారికి ప్రియకరములైన పురాణములనో నవీన వ్యవసాయ ఆర్థిక విషయములనో చదువుటయే యుక్తము. జ్ఞానచక్షువులు నేత్రములుగాని శ్రోత్రములు కావుగనుక ఉద్యమప్రియుడీ నిరక్షరులకై ప్రత్యేకముగ హృద్యమైన బొమ్మలపుస్తకముల నేర్పాటు చేయుట మంచిది. వీనిని ప్రత్యేకముగ తయారు చేయవలసియుండును; లేదా సచిత్ర దిన, వార, పక్ష, మాసపత్రికలనుండి సుబోధకమగునట్లు సక్రమముగ జోడించవలయును. పల్లెటూరి యుపాధ్యాయుడీ అక్షరశూన్యులకు పత్రికలను చదివి వినిపించుచు, ఈ యుద్యమనేత్తలు ప్రచురించు సచిత్రపత్రికలను వారి యుపయోగమునకై వినియోగింపవలయును.

నిరక్షర నిర్మూలనము.

రషియా మొదలగు దేశములలో నభ్యసించుచుండు ఇదే మాస్తరు పద్ధతి సాధ్యమైనంత త్వరలో వాచకుని సహాయ మపేక్షించకయే తమకు తామే చదువుకొనవలయుననెడి తీవ్ర ఆకాంక్ష పెద్దవారిలో కలుగజేయునను నమ్మకమును సూచించుచున్నది. అట్టివారికి వ్రాత-చదువు - లెక్క నేర్పుటకై తగు నేర్పాటుల జేయుట గ్రంథాలయోద్యమ ప్రియులకు విధియై యున్నది. అట్టి పరిస్థితులలో వయసు మీరినవా రనేకు లొక సంవత్సరకాలములో చిన్నచిన్న పుస్తకములను, రెండు సంవత్సరములలో కొంత పెద్దపుస్తకములను గూడ చదువగలుగుదురని రషియాలోని అనుభవమువలన తెలియుచున్నది.

# తాడేపల్లిగూడెం తాలూకా గ్రంథాలయ యాత్ర.

**25-2-35 మొదలు 16-3-35 వరకు.**

| | |
|---|---|
| యాత్రాదినములు | 20 |
| యాత్రికులు కాలిమీద నడచిన మైళ్లు | 83 |
| బండ్లమీద పోయిన మైళ్లు | 42 |
| రైలుమీద పోయిన మైళ్ళు | 17 |
| మొత్తపు సంచారపు మైళ్ళు | 142 |
| యాత్రాసందర్భమున | |
| పలువురచే నివ్వబడిన ఉపన్యాసములు | 150 |
| మ్యాజికులాంతరుప్రదర్శనములు | 50 |
| ఈయాత్ర మొత్తమునకు అయిన ఖర్చు | 61 |
| తాలూకావిస్తీర్ణము - చతురపుమైళ్ళు | 343 |
| జనసంఖ్య | 1,63,721 |
| తాలూకాలో గ్రామములు | 115 |
| ఇందులో పంచాయితీ ఉన్న గ్రామములు | 55 |
| తాలూకాలో గ్రంథాలయములసంఖ్య మొత్తము | 51 |
| పంచాయతీగ్రంథాలయములు | 31 |
| సంఘములచే నిర్వహింపబడు గ్రంథాలయములు | 17 |
| జిల్లాబోర్డుచే నిర్వహింపబడుచున్నవి | 3 |
| యాత్రలో నూతనముగా స్థాపింపబడినవి | 8 |
| యాత్రలో పునరుద్ధరింపబడినవి | 5 |
| సంచారము చేసిన గ్రామములు | 46 |
| గ్రంథాలయము ఉన్న గ్రామములు | 45 |
| ఆ గ్రామముల జనసంఖ్య | 86,372 |
| ఈవత్సరములో ఒకమనిషి చదివిన గ్రంథములు | 1¼ |
| మొత్తము జనసంఖ్యలో ప్రతి నలుగురు మనుష్యులకు ఉన్న పుస్తకము | 1 |
| గ్రంథాలయములలో ఉన్న గ్రంథములసంఖ్య | 20,979 |
| ఈవత్సరములో చదువబడిన గ్రంథములసంఖ్య | 51,569 |
| గ్రంథాలయములలో తెప్పింపబడు పత్రికల సంఖ్య | 144 |
| వానిని ప్రతినిత్యము చదువువారి సంఖ్య | 426 |
| సంఘములచే నిర్వహింపబడు (పంచాయితీలచే గాక) 17 గ్రంథాలయములందలి సభ్యులు. | 421 |
| ఈ గ్రంథాలయములకు జమ | 3,397- 7-0 |
| ఈగ్రంథాలయములకు ఖర్చు | 2,765-13-0 |
| స్వంతభవనమున్న 11 గ్రంథాలయముల భవనముల ఖరీదు. | రు 33,950 |
| ఈసంవత్సరమున జరిగిన సభలు, ఉత్సవములు | 130 |

**సూచిక:**—ఉచితముగా సంపాదించిన గ్రంథముల, పత్రికల ఖరీదు ఇందులో చేరలేదు.

## శారదాగ్రంథాలయము, తాడేపల్లిగూడెము.

తాడేపల్లిగూడెము తాలూకా గ్రంథాలయ సంఘము వారిచే అన్ని గ్రంథాలయములయందును నూతనోత్సాహము ప్రజ్వలింపజేయుటకును, లేని స్థలములలో గ్రంథాలయమును ప్రారంభించుటకును, ఉండి పనిచేయుచున్న గ్రంథాలయములలో యౌవనోత్సాహము కలిగించుటకును ప్రారంభింపదలంచిన తాడేపల్లిగూడెం తాలూకా గ్రంథాలయ యాత్ర 1935వ సంవత్సరము ఫిబ్రవరినెల 25 తేదీ సాయంత్రము తాడేపల్లిగూడెములోని శ్రీ సతీహితబుధి వారిచే నిర్వహింపబడుచున్న శారదా గ్రంథాలయము వారి ఆదరణను జరుపబడిన సభమూలముగా ప్రారంభింపబడెను. సర్దార్ దండు నారాయణరాజుగారు తత్సభ కధ్యక్షత వహించి యాత్రను ప్రారంభించుచు మానవజీవితములో విద్యావిహీనత దుర్భరమనియు, అందులకు నేటిపద్ధతుల నవలంబించి గ్రంథాలయములే శరణ్యములనియు, అట్టి గ్రంథాలయములు ఊరూర నేర్పడు టత్యవసరమనియు వివరించి ఈ యాత్రాదళము వారు ఊరూర నూతనజ్ఞానజ్యోతి ప్రజ్వరిల్లజేయ గలరనియు ప్రబోధించి యనంతరము గ్రంథాలయయాత్రను ప్రారంభించినటుల ప్రకటించిరి. తదుపరి రావుసాహెబు కవ్యం భోగప్పయ్యశాస్త్రి, బి. ఎ. (రిటైర్డు డిప్యూటి కలెక్టరు)గారు జ్ఞానయాత్రనుగురించియు, ఆధ్యాత్మికజీవితమున జ్ఞానావశ్యకతనుగురించియు, శ్రీ పుచ్చా వెంకట్రామయ్యగారు (ప్రకృతిసంపాదకులు) సహజజీవితము-ఆరోగ్యసూత్రములనుగురించియు, శ్రీ అయ్యంకి వేంకటరమణయ్యగారు గ్రంథాలయములు - తదభివృద్ధినిగురించియు, శ్రీ మంగిపూడి పురుషోత్తమశర్మగారు గ్రంథాలయములు గ్రామాభివృద్ధి సాధనోపాయములనుగురించియు, శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్యగారు భారతాభ్యుదయమునకు గ్రంథాలయము లెటుల తోడ్పడునదియు, శ్రీ విఠాల వీరభద్రరావుగారు దేశాభివృద్ధికి గ్రంథాలయము లెటుల నవసరమగుచున్నదియు గంభీరముగను, సవిమర్శముగను నుపన్యసించిరి. అధ్యక్షులకు వందనములతో సభ ముగింపు గావింపబడెను. యాత్రికులకు శ్రీ డాక్టరు కేతరిసత్యనారాయణమూర్తిగారు సన్మానమొసంగి ఆతిథ్యమొసంగిరి. నాడు సభకుపూర్వము శ్రీశారదాగ్రంథా

లయమును యాత్రికులు సందర్శించిరి. గ్రంథాలయమున 635 పుస్తకములు గలవు. 10 పత్రికలు వచ్చుచున్నవి. స్త్రీలు చాలా అభివృద్ధికరముగా నిర్వహించుచున్నారు. ఆనాటి పటనే కాలక్షేపము గావించిరి.

### జిల్లాబోర్డు గ్రంథాలయము, తాడేపల్లిగూడెం.

తాలూకాబోర్డులున్నపుడు స్థానిక తాలూకాబోర్డువారిచే స్థాపింపబడి రు 12,000 లు విలువగల భవనముతో జిల్లా బోర్డు పాలనలోనికి బోయెను. ఇప్పుడు 782 పుస్తకములును, 14 పత్రికలును గలవు. ఈ గ్రంథాలయమును యాత్రికులు 26 వ తేదీ ఉదయము సందర్శించి రైలుపై బొమ్మిడి బయలుదేరి వెడలిరి.

### శ్రీ వేణుగోపాలగ్రంథాలయము, బొమ్మిడి.

ఉదయము 10 గంటలకు యాత్రికదళమును బొమ్మిడి వాస్తవ్యులు మేళతాళములతో నెదుర్కొని గ్రామ సంకీర్తనానంతరము నడివీధిలోని సభావేదికకు దోడ్కొని వెడలిరి. అచట నొక బహిరంగసభ శ్రీ వర్యం భోగప్పయ్య శాస్త్రిగారి అధ్యక్షతను నిర్వహింపబడెను. అధ్యక్షులు, ఆధ్యాత్మవిద్యను గురించియు, అయ్యంకి వెంకటరమణయ్య, వావిలాల గోపాలకృష్ణయ్య, తిల్లాప్రగడ భీమేశ్వరరావుగార్లు గ్రంథాలయోపయోగములగూర్చియు నుపన్యసించిరి. అధ్యక్షులకు, అతిథులకు స్థానిక పంచాయతీబోర్డు అధ్యక్షులగు దద్దవాల లక్ష్మీసత్యనారాయణగారు అభినందనములు సమర్పించిరి. ఇచటనిదివరలో స్థాపింపబడిన శ్రీవేణుగోపాలగ్రంథాలయము కలదు. దాని నిపుడు గ్రామపంచాయతీవారు స్వీకరించి రు 50 లు వ్యయపరచి నిర్వహించుటకు పంచాయతీచే తీర్మానము గావింపజేసిరి. పత్రికలు తెప్పింపబడుచున్నవి. నూతనోత్సాహము కలుగజేయబడెను.

యాత్రికు లచటినుండి కాగపాడు వెడలి అచట పంపురతో సంప్రదించి అచటినుండి నాచుగుంట వెడలిరి.

### శ్రీ గౌరీదేవిగ్రంథాలయము, నాచుగుంట.

ఈగ్రంథాలయము నాచుగుంట గ్రామపంచాయతీచే నిర్వహింపబడుచున్నది. ఇందు 270 పుస్తకములు కలవు, ఇండ్లకివ్వకుండుటచే పుస్తకములు ప్రోత్సాహకరముగ జదువబడుటలేదు. అచటి గ్రామయువకులను పిలిపించి అభివృద్ధి విధానము లాలోచింపబడెను. తదనంతరము శ్రీ అయ్యంకి వెంకటరమణయ్య, వావిలాల గోపాలకృష్ణయ్యగార్లు గ్రంథాలయావశ్యకతనుగురించి ప్రబోధించిరి. గ్రంథాలయమునకు అవసరమగు అభివృద్ధుల నన్నిటిని గాలించుటకు శ్రీ సుంకవిల్లి భాస్కరరావుగారిచే వాగ్దానము బడసి యాత్రికులచటినుండి ఉంగుటూరువెళ్ళి ఆరాత్రి అటనే యుండి మరుదిన ముదయము తిల్లాపురమున జేరిరి.

### శ్రీరామగ్రంథాలయము, తిల్లాపురము.

ఇది గ్రామపంచాయతీచే స్థాపింపబడెను. ఒకపూరియింట నుంపబడుచుండెను. ఇందు 50 పుస్తకములు మాత్రమే ఉండెను. జనులలో ఉత్సాహము మాత్రము విరివిగా గాన్పించుచున్నది. గ్రంథాలయము రామమందిరములోనికి జేర్చబడెను. తదనంతరము రామమందిరమున శ్రీ తల్లాప్రగడ భీమేశ్వరరావుగారి అధ్యక్షతను బహిరంగసభ గావింపబడెను. అధ్యక్షుడు, అయ్యంకి వెంకటరమణయ్య, వావిలాల గోపాలకృష్ణయ్యగార్లు గ్రంథాలయాభివృద్ధి గావించవలసినదిగను, అందువలన కలుగు ప్రయోజనమును వివరించుచు నుపన్యసించిరి. 10 గంటలకు సభ ముగింపు గావింపబడెను. అంతట యాత్రికులు ఉంగుటూరు వెడలిరి.

### శ్రీరామమోహన గ్రంథాలయము, ఉంగుటూరు.

1910 వ సంవత్సరములో స్థాపింపబడి నేటికి 1175 పుస్తకములు కలిగి ఈనడుమనే గ్రామపంచాయతీకి స్వాధీన పరచబడినది. గ్రామమున విద్యాధికులు పలువురు కలరు. అనేక పత్రికలు వచ్చుచున్నవి. ఈ గ్రంథాలయమున నొక బహిరంగసభ గావింపబడెను. అందు శ్రీ అయ్యంకి వెంకటరమణయ్యగారు, వావిలాల గోపాలకృష్ణయ్య గ్రంథాలయప్రయోజనము విద్యాధికులు నిరక్షరాస్యులయెడ నొనరింపవలసిన విధులనుగురించి గంభీరముగా నుద్బోధించిరి గ్రంథాలయమునకు ఇదివరలో భవన ముండెడిది. అది శిథిలమైనది. నూతనప్రయత్నములు జరుగుచున్నవి. చాలఅభివృద్ధియగుటకవకాశము కలదు.

### శ్రీరామకృష్ణగ్రంథాలయము, ఉంగుటూరు.

ఇది సంవత్సరము క్రితము అచ్చముగా విద్యార్థులచే నెలకొల్పబడినది. కార్యదర్శులు వారే. 15 సంవత్సరములలోపు పసిబిడ్డలు. కాని ఉత్సాహము ప్రశంసనీయము. దీని తరఫున వాగ్వర్ధనీసంఘము పనిచేయుచున్నది. రెండు దినపత్రికలుకూడ వచ్చుచున్నవి. ఇందు 492 పుస్తకములు కలవు. పాఠశాలలో విద్యార్థులు 300 మంది కలరు. విద్యార్థులకు శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్యగారు గ్రంథాలయమును అన్నివిధముల నుపయోగించుకొని గొప్పవారై ధనికులు కావలయు నని ఉద్బోధించిరి. గ్రంథాలయమును

ఆత్మాలాగ్రముగా సందర్శించిరి. అటుపై యాత్రికులు చేబ్రోలు వెడలిరి.

### శ్రీ బాలసరస్వతీ గ్రంథాలయము, చేబ్రోలు.

గ్రంథాలయమున 460 పుస్తకములు, 5 పత్రికలు గలవు. శ్రీ దావులూరి సూర్యారావుగారు రు 2000 విలువ గల భవనమును గట్టించి గ్రంథాలయమున కొసంగిరి. వీరి యౌదార్యము ప్రశంసాపాత్రము. ఇపుడు జిల్లాబోర్డుకు స్వాధీనపరచదలంచియున్నారు. సాయంత్రము యాత్రా దళమువారు గ్రామసంకీర్తనము గావించిన యనంతరము గ్రంథాలయావరణమున నొక బహిరంగసభ గావించిరి. ఆ సభకు డాక్టరు ఆచార్యులుగా రధ్యక్షత వహించిరి. డాక్టరు వేతలి సత్యనారాయణమూర్తిగారు తాలూకా గ్రంథాలయచరిత్రను గురించియు, శ్రీ విశాల వీరభద్రరావుగారు ప్రజాజీవితమునందలి గ్రంథాలయ ప్రయోజనమును గురించియు, శ్రీ అయ్యంకి వెంకటరమణయ్యగారు గ్రంథాలయనిర్వహణము - ప్రజోపయోగవిధానమును గురించియు, శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్యగారు ప్రతివ్యక్తియు ప్రపంచోపయోగమున కుపయోగపడు విధమునుగురించియు వివరించిరి. గ్రామముసభుగారును అధ్యక్షులవారును ప్రసంగించిన యనంతరము అధ్యక్షులకు, అతిథులకు వందనసమర్పణముతో సభ ముగింపు చేయబడెను. శ్రీఉప్పల్ల లక్ష్మీనారాయణగారు, విశాల విశ్వనాథశాస్త్రిగారు ఈ దళములో గలిసిరి. ఆరాత్రి అటనే కాలక్షేపము గావించి అచటినుండి మరుదిన ముదయమున బయలుదేరి ఉంగుటూరిమీదుగా శ్రీ దండు నారాయణరాజుగారితో కాగుపాడు జేరిరి.

### శ్రీగోపాలకృష్ణ గోఖలే గ్రంథాలయము, కాగుపాడు.

ఈ గ్రామములో దాదాపు 20 సంవత్సరములక్రితము గొప్ప గ్రంథాలయము నిర్వహింపబడి ఆంధ్రప్రముఖుల ననేకుల పిలిపించి మహోత్సవముల జరిపియుండిరి. కాని ఈ మధ్య సంభవించిన అభిప్రాయభేదమువలన ఆగ్రంథాలయము ఊరు,పేరు లేనిదై ఆస్తియంతయు అమ్మబడెను. కాని ప్రజలలో విజ్ఞానాతురత బహు తీవ్రముగా నున్నది. గ్రంథాలయము స్థాపింపవలెనను కుతూహలము గలదు. యాత్రికులు 7 గంటలకు చేరి అందరిని ప్రోత్సహించిరి. శ్రీ దండు నారాయణరాజుగారిచే నూతనముగ గ్రంథాలయము శ్రీ గోఖలేగారి పేరిట పునరుద్ధరింపబడినది. దాదాపు 80 పుస్తకములవరకు అప్పటికప్పుడే సమకూర్చబడెను. పంచాయతీనుండి దినపత్రిక తెప్పింపబడుచునే యున్నది. గ్రామ ఉమ్మడిధనమునుండి రు 100 లు వ్యయపరచి గ్రంథాలయమును నిర్వహించుటకును త్వరలో నూతనభవనమును నిర్మాణముగావించుటకును తగుఏర్పాట్లు గావించిన యనంతరము సాయంత్రము 3 గంటలకు శ్రీ ఉప్పల్ల లక్ష్మీనారాయణగారు మ్యాజికులాంతరు ప్రదర్శన మొసంగిరి. అంత యాత్రికులు బయలుదేరి రావులపర్రుగ్రామము జేరిరి.

### శ్రీ వెంకాయమ్మ పుస్తక భాండాగారము, రావులపర్రు.

శ్రీ తల్లాప్రగడ ప్రకాశరాయుడుగారిచే 1931 లో స్థాపింపబడి నేటికి 305 పుస్తకములతో నిత్యోత్సాహముతో ప్రజ్వలించుచున్న గ్రంథాలయము కలదు. ఇది ప్రస్తుతము గ్రామపంచాయతీబోర్డువారు నిర్వహించుచున్నారు. గ్రామమునం దుత్సాహము విరివిగా కలదు. భోజనానంతరము నడివీధిలోని శ్రీరామమందిరమువద్ద శ్రీ యుధిష్ఠిరులవారి అధ్యక్షతను బహిరంగసభ జరుపబడెను. గ్రామోఫోను సంగీతానంతరము శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్యగారు దాదాపు గంటకాలము గ్రంథాలయ ప్రయోజనములగురించియు తదుపయోగ విధానమును గురించియు గంభీరముగ నుపన్యసించిరి. తదనంతరము శ్రీ ఉప్పల్ల లక్ష్మీనారాయణగారు మ్యాజికులాంతరు ప్రదర్శనము గావించిరి. ఆరాత్రి అటనుండిమరుదిన ముదయమున బయలుదేరి యాత్రికులు రామూరు గ్రామము జేరిరి.

### శ్రీవివేకానంద గ్రంథాలయము, రామూరు.

ఇచట శ్రీ వివేకానంద గ్రంథాలయము- క్రిందటి సంవత్సరము స్థాపింపబడినది. ఇందు 379 పుస్తకములు కలవు. రెండుమూడు పత్రికలును వచ్చుచున్నవి. ఉత్సాహముగల సామాన్యవిజ్ఞానవంతులగుయువకులు కలరు. ఇచట మధ్యాహ్నము 2 గంటలకు రామమందిరమున నొక బహిరంగ సభ నిర్వహింపబడెను. శ్రీ తల్లాప్రగడ భీమేశ్వరరావు, వావిలాల గోపాలకృష్ణయ్యగార్లు గ్రంథాలయప్రయోజనములనుగురించి, యాత్రోద్దేశములనుగురించియు నుద్బోధించి గ్రంథాలయాభివృద్ధికి పూనుకొనుటకు వాగ్దానము చేసిరి. శ్రీ ఉప్పల్ల లక్ష్మీనారాయణగారు మ్యాజిక్ లాంతరుపన్యాసము నొసంగిరి. అంతట యాత్రికులు చిననిండ్రకొలను (పత్తేపురం) వెడలిరి.

### శ్రీ జ్ఞానానంద గ్రంథాలయము, చిననిండ్రకొలను.

ఇచట నూతనముగ పంచాయతీ ప్రారంభింపబడినప్పుడు ఉత్సాహముతో ప్రారంభింపబడిన ఈగ్రంథాలయము

పంచాయతీలోని వివాదములను పంచాయతీ కోర్టులపాలగుటచేతను ప్రస్తుతము నామమాత్రముగ నున్నది. వాజ్యములు కోర్టులలోనుండుటచే ప్రస్తుతము తద్గ్రంథాలయమునగాని, పంచాయతీసందర్భములోగాని ఐక్యము కలిగించుకొనవలదనుటచే విధిలేక యాత్రికు లచటినుండి దేవరగోపవరము గ్రామము వెడలిరి.

## పంచాయతీగ్రంథాలయము, దేవరగోపవరము.

రెండుసంవత్సరములక్రితము పంచాయతీతో పాటు ఈ గ్రంథాలయమును స్థాపింపబడెను. ఇపుడు 80 పుస్తకములు కలవు. ప్రజలలో నుత్సాహము ప్రజ్వరిల్లజేయుటకవకాశము కలదు. శ్రీరామమందిరమునం దొక బహిరంగసభ జరుపబడెను. గ్రామపంచాయతీబోర్డు ప్రెసిడెంటగు శ్రీ వేలపోలు సుబ్బారావుగారు అధ్యక్షత వహించిరి. శ్రీ డాక్టరు తేతలి సత్యనారాయణమూర్తి, వావిలాల గోపాలకృష్ణయ్య, తల్లాప్రగడ భీమేశ్వరరావుగార్లు గ్రంథాలయప్రయోజనములగురించి విపులముగ నుద్బోధించిరి. గ్రామమున నూతనప్రచలనము కలుగజేయగలిగిరి. స్త్రీపురుషు లత్యుత్సాహము కనబరచిరి. శ్రీ ఉప్పల్ల లక్ష్మీనారాయణగారు మ్యాజిక్ లాంతరుప్రదర్శనము గావించిరి. ప్రజలలో గన్పరచిన ఆనందమునకు మేరయే లేదు. ప్రజలను చందాలు వేయగోరిరి. కృష్ణాపత్రిక మొదలగు నాల్గయిదు పత్రికలకు చందాలు వేయబడెను. గ్రంథాలయమునకు చందాలు వసూలుచేసియు, పంచాయతీనుండి ధనము వ్యయపరచియు అభివృద్ధిచేయుటకు వాగ్దానములు తీసికొనబడెను. అంత యాత్రికులు రాత్రికిరాత్రి పెదనిండ్రగొలను జేరిరి.

## శ్రీ గౌరీశంకరగ్రంథాలయము, పెదనిండ్రగొలను.

స్థానికపంచాయతీబోర్డుచే 1927లో స్థాపితమై 600 పైగా గ్రంథములు కలిగియు సరియగు ప్రయోజనమును పొందక యున్న గ్రంథాలయము కలదు. ఇం దమూల్యమగు గ్రంథములు, శాస్త్రవిషయకపుస్తకములు విరివిగా కలవు. చాల అభివృద్ధినందునట్టి అవకాశములు కలవు. ఈ గ్రంథాలయమును యాత్రికులు మార్చి 2వ తేదీ ఉదయము సందర్శించిరి. అటుతరువాతి యాత్రికులు విద్యార్థుల గ్రంథాలయమును సందర్శించిరి. అటనుండి మధ్యాహ్నము 10 గంటలకు రామమందిరమున గ్రామఫోనుసంగీతానంతరము శ్రీ తల్లాప్రగడ భీమేశ్వరరావుగారి అధ్యక్షతను బహిరంగసభ గావింపబడెను. శ్రీ అధ్యక్షులు, శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య, అయ్యంకి వేంకటరమణయ్యగార్లు గ్రంథాలయోపయోగములనుగూర్చి, గ్రంథాలయనిర్వహణమునుగురించియు వివరముగ విపులముగ నుపన్యసించిరి. శ్రీ దశిక సుబ్బయ్యగారు స్థానికగ్రంథాలయ స్థితిగతులను వివరించి ప్రజలతోడ్పాటు నభిలషించిరి. అధ్యక్షునితుదిపలుకులతోడను, అధ్యక్షులకు, అతిథుల వందనసమర్పణముతోడను సభ ముగింపబడెను.

## శ్రీ విద్యార్థుల గ్రంథాలయము, పెదనిండ్రగొలను.

విద్యార్థుల గ్రంథాలయము ప్రాథమిక పాఠశాలా విద్యార్థులు స్వవృద్ధికొరకు స్థాపించుకొనిరి. ఇందు 121 పుస్తకములు కలవు. దీని అభివృద్ధికి ఆదాయముకై కొల్లేటిమునకలోని 10 ఎకరముల పొలము అమరకమునకు దీసికొని సేద్యము చేయుచున్నారు. బాలురు ఇంటింటికి దీసికొనిపోయి తమతలిదండ్రులకు పత్రికలు చదివి వినిపించుటమూలముగా వయోజనవిద్యావ్యాప్తికి తోడ్పడుచున్న బిడ్డలపరిశ్రమ ప్రశంసనీయము. శ్రీ ఉప్పల్ల లక్ష్మీనారాయణగారిచే మ్యాజిక్‌లాంతరుప్రదర్శనము గావింపబడిన యనంతరము చర్చాసంఘము శ్రీ అయ్యంకి వేంకటరమణయ్యగారి అధ్యక్షతను ప్రారంభోత్సవము జరుపబడెను. శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య, తల్లాప్రగడ భీమేశ్వరరావుగార్లు గ్రంథాలయములు - చర్చాసంఘము - తద్విధానములను గురించి యుపన్యసించిరి. చిరంజీవులు మండలపర్తి సూర్యనారాయణమూర్తి, చిన్నమిల్లి అప్పారావులు (గ్రంథాలయ సహాయకార్యదర్శులు, 7వ తరగతి విద్యార్థులు) గ్రంథాలయ ప్రయోజనమునుగురించి ప్రసంగించిరి. శ్రీ దశిక సుబ్బయ్యగారు వందనములు సమర్పించుటతో ప్రారంభోత్సవము ముగింపుగావింపబడెను.

అచటినుండి యాత్రికులు సాయంత్రానికి నిడమర్రు జేరిరి.

## పోతనగ్రంథాలయము, నిడమర్రు.

ఇచట 20 సంవత్సరముల క్రితము పోతన గ్రంథాలయము స్థాపింపబడి అమోఘమైన పని గావించి సుమారు 500 ల విలువగల భవనము కలిగియుండెను. స్థానికవివాదములచేత నది నిద్రావస్థ నుండెను. రాత్రి వీధిలో గ్రామఫోనుసంగీతానంతరము బహిరంగసభ జరుపబడెను. శ్రీ శృంగారకవి పాపారావుగారు యాత్రికులను సభ్యుల కెరుకపరచిరి. శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్యగారు గ్రంథాలయమువలన నెటు లభివృద్ధి బడయనగునో, వివరించుచు

గంభీరముగా నుపన్యసించిరి. అటుపై శ్రీ ఉప్పెర్ల లక్ష్మీ నారాయణగారిచే మ్యాజిక్‌లాంతరు ప్రదర్శనము గావింపబడెను. నాడటనే యుండిరి.

### శ్రీలక్ష్మీనారాయణగ్రంథాలయము, పడమర్రు.

మరుదినము మహాశివరాత్రి. మార్చి 8 తేదీ ఉదయము యాత్రికులు మరుగ్రామమునకు బయలుదేరు చుండగా శ్రీ నిడమర్తి గౌరీశంకరదత్తు గారిని యాత్రికులు సందర్శించుట తటస్థించెను. గ్రంథాలయము లక్ష్మీనారాయణ గ్రంథాలయమను పేరిట పునరుద్ధరించుటకును ఆ పాత భవనములో నుంచుటకును నంగీకరించుటయే కాక అప్పటి కప్పుడు భవనము బాగుచేయించి అచటి పునరుద్ధరణ కార్యక్రమము నిర్వహింపబడెను. రు 25-0-0 లు విరాళముకూడ నొసంగబడెను. భవనము 500 ల విలువ చేయునది. కొలది చికిత్సలు గావించిన నుపయోగించుట కవకాశము కలదు. అది జరుపుటకే వాగ్దాన మొసంగిరి. ఇంత భవనము ఏ గ్రంథాలయమునకును లేదనుట అతిశయోక్తి కానేరదు. అచటి నుండి యాత్రికులు అడవికొలను వదలిరి.

### గ్రామపంచాయతీ గ్రంథాలయము, అడవికొలను.

1928 లో స్థాపితమై 118 పుస్తకములతో, ఒక దిన పత్రికతోడను నలరారుచు పరస్పరసహాయసంపత్తులతో నున్న ప్రజలమధ్య నిత్యనూతనోత్సాహముతో నలరారు చున్న గ్రంథాలయము కలదు. పంచాయతీ నిర్వహించు చున్నది. గ్రామమునందంతటను స్వాగతపత్రములతోడ యాత్రికులను సన్మానించిరి. 10 గంటలకు నిడమర్రునందు నూతనగ్రంథాలయ స్థాపనానంతరము అడవికొలను జేరిరి. భోజనానంతరము బహిరంగసభ జరుపబడెను. డాక్టరు. శృంగారకవి పాపారావుగారు అధ్యక్షతను వహించిరి. శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్యగారు, అయ్యంకి వేంకట రమణయ్యగారు, చింతలపాటి లచ్చిరాజుగారును గ్రంథాలయోపయోగమునుగురించియు తదుపయోగములను గురించియు నుపన్యసించిరి. గ్రామస్థులు యాత్రికులకు సన్మానపత్రము సమర్పించిరి. అధ్యక్షుల తుదిపలుకులతో సభ ముగింపుగావింపబడెను. శ్రీ ఉప్పెర్ల లక్ష్మీనారాయణ గారు మ్యాజిక్‌లాంతరుప్రదర్శనము గావించిరి. ప్రజల యందు నూతనోత్సాహమును ప్రకోపింపచేయగలిగిరి. గ్రామములో తుంగచాపల పరిశ్రమ కలదు. చాలా ప్రశంస నీయముగా నున్నది. యాత్రికు లచటనుండి రాత్రికి చానమిల్లికి జేరిరి.

### శ్రీవిజ్ఞానప్రచారిణీగ్రంథాలయము, చానమిల్లి.

1919లో స్థాపితమై 600 అమూల్యగ్రంథములతో నల రారు గ్రంథాలయము కలదు. ప్రజలలో విజ్ఞానకాంక్ష కూడ కలదని ద్యోతక మగుచున్నది. రెండు మూడు వార పత్రికలతో నలరారుచునే యున్నది. రాత్రి బహిరంగసభ జరుపబడెను. శ్రీ చింతలపాటి లచ్చిరాజుగా రధ్యక్షత వహించిరి. శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య, అయ్యంకి వేంకటరమణయ్యగార్లు గ్రంథాలయోపయోగములనుగురించియు జ్ఞానావశ్యకతనుగురించియు ప్రబోధము గావించిరి. గ్రామఘోషసంగీతము వినిపింపబడెను. శ్రీ విశాల విశ్వనాథశాస్త్రిగారు మ్యాజిక్‌లాంతరు ప్రదర్శనము మూలమున ప్రబోధించిరి. నూతన అభివృద్ధిని పొందించుటకు, గ్రంథము లభివృద్ధి చేయుటకు గ్రామస్థులు, పంచాయతీవారు వాగ్దాన మొసంగిరి. ఆరాత్రి అచటనే యుండి మరుదినము గణపవరము జేరిరి.

### నాగేశ్వరరాయగ్రంథాలయము, గణపవరము.

1928లో స్థాపితమై 1400 గ్రంథములతో నలరారు చున్నది. అనేక పత్రికలు కలవు. దినదినాభివృద్ధి నందు చున్నది. గొప్ప గ్రంథాలయము. అనేక విధముల నుపయోగ పడుచున్నది. ఉదయము గ్రంథాలయప్రదర్శనము గావింపబడెను. భజనతో తాళములతో పురజనులతో గ్రామసంకీర్తనము గావించిన యనంతరము గ్రామఘోషసంగీతానంతరము శ్రీ చింతలపాటి లచ్చిరాజుగారి అధ్యక్షతను బహిరంగ సభ జరుపబడెను. శ్రీ గిరికిపాటి బాలవెంకటకృష్ణమూర్తి గారు పద్యములతో స్వాగతమొసంగి గ్రంథాలయచరిత్రను నివేదించిరి. శ్రీవావిలాల గోపాలకృష్ణయ్యగారు జ్ఞానావశ్యకత- అందుకు గ్రంథాలయము లుపయోగింపదగు విధముల గురించియు, శ్రీ అయ్యంకి వేంకటరమణయ్యగారు, ఎడాల వీరభద్రరావుగార్లు గ్రంథాలయోపయోగ విధానముల గురించియు, శ్రీ చింతలపాటి నూరపరాజుగారు, వేగేశ నూరపరాజుగారు స్థానికగ్రంథాలయాభివృద్ధినిగురించియు నుపన్యసించిన యనంతరము అధ్యక్షుని తుదిపలుకులతో సాయంత్రము 2 గంటలకు సభ ముగింపుచేయబడెను. శ్రీ విశాల విశ్వనాథశాస్త్రిగారు మ్యాజిక్‌లాంతరుప్రదర్శనమును గావించిరి. గ్రామమంతయు స్వాగతఫలకము లతోడను, తోరణములతోడను అలంకరింపబడుటవలన నూతనోత్సాహము గమనింపవచ్చును. స్థానికముగా అభిప్రాయభేదము లున్నను ప్రజాభ్యుదయపుటుద్యమములలో వారు గనపరచిన సౌమనస్యము, సహకారము ప్రశంసార్హములు. యాత్రికు లచటనుండి బయలుదేరి సరిపల్లె వెళ్లిరి.

### శ్రీ చక్రపాణి గ్రంథాలయము, నరిశపల్లె.

1928 వ సంవత్సరములో సామాన్యప్రజోపయోగము నకు స్థాపింపబడి తర్వాత స్థానికసభ్యాభిప్రాయానుసారము వేద పాఠశాల కనుబంధముగ చేర్చబడి అచటి విద్యార్థులచే నుప యోగింపబడుచుండెను. ఇందు 1602 పుస్తకములు కలవు. ఈ విద్యాలయము చాలా గొప్పసేవ చేయుచున్నది. ఈ గ్రంథాలయమును, పాఠశాలను యాత్రికులు సందర్శించిరి.

### శ్రీ రాజేశ్వరీ యువజనసంఘ పఠనమందిరము, నరిశపల్లె.

స్థానిక యువకులచే ప్రబోధముసకై స్థాపింపబడిన పై సంఘమువారు 4-5 పత్రికలను తెప్పించి పఠనమందిరమును నిర్వహించుచున్నారు. క్రీడలు మొదలగు వినోదోత్సాహ కార్యముల జరుపుచున్నారు. చాపలు, చీపుర్లు ఇచట సభ్యు లు స్వయముగ తయారుచేయుచుండుట ప్రశంసనీయము. సభ్యులు విద్యాధికులే. సంఘమునకు ముఖ్యస్థలమున మంచి చిన్న అందమయిన, ముచ్చటయిన ఇల్లు కలదు. ఈమందిర మునకు చేరి గ్రంథాలయమునుకూడ నిర్వహించగలందు లకు వయోజనవిద్యాభివృద్ధికి ప్రయత్నించవలసినదనియు సభ్యులను ప్రబోధించుటలో యాత్రికులు అగ్రగామి వెడలిరి.

### శ్రీ మల్లేశ్వర గ్రంథాలయము, అర్ధవరము.

190 పుస్తకములు కలిగియున్న యొక చిన్న గ్రంథా లయము కలదు. పంచాయతీ నిర్వహించుచున్నది. చదివిన వారు పలువురు కలరు. నిత్యము పురాణపఠనము సాగింప బడుచునేయున్నది. ప్రజలలో సామాన్యవిజ్ఞానము బడయుటకును వార్తలు వినుటకును అధిక కుతూహలము కలదు. గ్రామోఫోనుసంగీతానంతరము బహిరంగసభ జరుపబడెను. శ్రీ చింతలపాటి సూరపరాజుగా రధ్యక్షత వహించిరి. శ్రీ విశాల వీరభద్రరావుగారు ప్రజాజీవితము నందలి గ్రంథాలయోపయోగములను గురించియు, శ్రీ అయ్యంకి వేంకటరమణయ్యగారు గ్రంథాలయోద్యమ వ్యాప్తినిగురించియు ప్రసంగించిరి. శ్రీ వావిలాల గోపాల కృష్ణయ్యగారు గ్రంథాలయావశ్యకతనుగురించియు ప్రసం గించిరి. తదనంతరము శ్రీ ఉప్పెర్ల లక్ష్మినారాయణగారిచే మ్యాజికులాంతరుప్రదర్శనము గావింపబడినయనంతరము సభ ముగింపు గావింపబడెను. ఆరాత్రి అటనే యుండి యాత్రి కులు మరుదినము వల్లూరుగ్రామము వెడలిరి.

### లక్ష్మీనరసింహ గ్రంథాలయము, వల్లూరు.

శ్రీచిలకమర్తి లక్ష్మీనరసింహంగారి గౌరవార్థమై 1915వ సంవత్సరములో స్థాపితమై జీర్ణావస్థలోనుండి ఈమధ్య శ్రీ యర్రా చంద్రయ్యగారి ప్రోత్సాహముచే పునరుద్ధరింపబడి రెండు సంవత్సరముల నుండి సత్రమాభివృద్ధి నందుచు రెండు పత్రికలను కలిగి, 86 పుస్తకములతో నలరారుచున్న గ్రంథాలయము కలదు. భజనతో గ్రామసంకీర్తనము గావిం చినయనంతరము శ్రీ చింతలపాటి సూరపరాజుగారి అధ్య క్షతను బహిరంగసభ గావింపబడెను. శ్రీ అయ్యంకి వేంకట రమణయ్య, విశాల వీరభద్రరావు, వావిలాల గోపాలకృ ష్ణయ్యగార్లు ప్రసంగించిరి. ప్రజలయం దొక నూతనోత్సా హము ప్రజ్వలింపజేయబడినదనుటలో సంశయము లేదు. ఇచట 40 మంది విద్యార్థులతో నిర్వహింపబడుచున్న సంస్కృత పాఠశాలయు కలదు. కొన్ని పత్రికలు తెప్పించి యిచ్చుటకు వాగ్దానములు జరిగెను. శ్రీ ఉప్పెర్ల లక్ష్మినారాయణగా రిచే మ్యాజికులాంతరుప్రదర్శనము గావింపబడెను. తద నంతరము యాత్రికులు 10 గంటలకు కొమ్మెరగ్రామము నకు వెడలిరి.

### శ్రీ వేంకటేశ్వర పుస్తకభాండాగారము, కొమ్మెర

1928 వ సంవత్సరమున స్థాపితమై ఇప్పటికిని నిద్రావస్థ లోనే యున్న ఈ గ్రంథాలయమునందు 120 పుస్తకములు గలవు. ఒక పత్రికయును గలదు. ఇచట జనాభాయును తక్కువగనే యున్నది. యాత్రికులు భజనతో గ్రామ సంకీర్తనము గావించిన యనంతరము గ్రామోఫోనుసంగీత కాలక్షేపము గావింపబడెను. శ్రీ వేగేశ్న సూరపరాజు గారి అధ్యక్షతను బహిరంగసభ జరుపబడెను. శ్రీ అయ్యంకి వేంకటరమణయ్య, వావిలాల గోపాలకృష్ణయ్య, విశాల వీరభద్రరావు చింతలపాటి లచ్చిరాజుగార్లు, గ్రంథాలయ ములవలన ప్రయోజనములను గురించి విపులముగ నుపన్య సించిరి. అంతట యాత్రికులు అచటనుండి బయలుదేరి పడమటి విప్పర్రుగ్రామము జేరిరి.

### శ్రీ వివేకానంద పఠనమందిరము, పడమటి విప్పర్రు.

ఇది 1907 లో స్థాపింపబడి దాదాపు అయిదారు దిన పత్రికలతోడను ఒకి వెయ్యి గ్రంథములతోను, మహో త్సాహపూరితముగ నిర్వహింపబడి ఈ నడుమ నిద్రా స్థితిలో నుండుటచే తత్పునరుద్ధరణకు తగు ఏర్పాటులు గావింప ప్రయత్నింపబడెను. పసుల కృష్ణమూర్తిగారి అధ్యక్షతను పునరుద్ధరణమునకు బహిరంగసభ సమావేశము గావింపబడెను. డాక్టరు కామాప్రగడ వెంకటాద్రి గారు కార్యదర్శిగా నొకసంఘము నేర్పాటు గావించిరి.

ఇకముందునుండి సక్రమముగ నిర్వహింపబడుటయను ఇది వరలో గ్రంథాలయముయొక్క పుస్తకముల నన్నింటిని సమకూర్చుటకును, పత్రికలద్వారా తెప్పించి అభివృద్ధి గావించుటకును వాగ్దానములుమాత్రమే కాక దీక్ష తీసికొనిన సంఘము నేర్పాటుగావించి యాత్రికులు పరిమెళ్ళ గ్రామమునకు రాత్రికి జేరిరి.

### శ్రీ రామలింగేశ్వర గ్రంథాలయము, పరిమెళ్ళ.

1926 వ సంవత్సరములో స్థాపింపబడి 880 పుస్తకములు కలిగి ఆరోగ్యము మొదలగు ప్రజాజీవిత సంబంధములగు సభలతోడను, ఉత్సవములతోడను నిర్వహింపబడుచున్న ఈగ్రంథాలయము అభివృద్ధికరముగనే యున్నది. ఈగ్రంథాలయముయొక్క అష్టమవార్షికోత్సవము శ్రీ అయ్యంకి వేంకటరమణయ్యగారి అధ్యక్షతను నిర్వహింపబడెను. ప్రథమమున అధ్యక్షోపన్యాసమైన యనంతరము శ్రీ డాక్టరు తేతలి సత్యనారాయణమూర్తిగారు, వావిలాల గోపాలకృష్ణయ్యగారు ప్రాచీన గ్రంథాలయ చరిత్రను గురించియు, శ్రీ విశాల వీరభద్రరావుగారు ప్రజాజీవితమునందలి గ్రంథాలయముల స్థానమును గురించియు, శ్రీ వేగేశన సూరపరాజు, చింతలపాటి లచ్చిరాజుగార్లు గ్రంథాలయములనుగురించియు ఉపన్యసించిరి. కార్యదర్శి శ్రీ నాట్ల వెంకటరాజుగారు గ్రంథాలయ నివేదికను సమర్పించిరి. అటుతరువాత శ్రీ ఉప్పుగల్లు లక్ష్మీనారాయణగారు మ్యాజిక్ లాంతరుప్రదర్శనము గావించిరి. ఆరాత్రి అచటనే యుండి, అచటినుండి మరుదిన ముదయము యానాంపల్లి గ్రామమును వదలిరి.

### శ్రీ లక్ష్మీవిలాసగ్రంథాలయము, యానాలపల్లి.

ఎన్నడో ఉండియుండిన శ్రీ సీతారామాంజనేయ గ్రంథాలయమను పేరిట స్థాపించుకొని వ్యవహరించిన విద్యార్థులు తదుపరి గ్రామపంచాయతీస్థాపనముతో 1926 అక్టోబరు మాసములో పైపేరిట స్థాపించి, పంచాయతీ అధీనములో నిర్వహింపబడుచున్నది. ఇందు 100 కి పైగా గ్రంథాలయములు కలవు. యాత్రికులు భజనతో గ్రామసంకీర్తనము గావించిరి. గ్రామఫోనుపాటల యనంతరము శ్రీ ఇందుకూరి సత్యనారాయణరాజుగారి అధ్యక్షతను బహిరంగసభ గావింపబడెను. శ్రీ అయ్యంకి వేంకటరమణయ్యగారు గ్రంథాలయముల ప్రయోజనములను గురించి, తన్నిర్వాహణమును గురించియు, శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్యగారు గ్రంథాలయ ప్రయోజనమును గురించియు నుపన్యసించిరి. ఆంధ్రపత్రికను తెప్పించుటకు వాగ్దానము స్వీకరించిరి. రెండు మూడు దినములలో తెప్పింతుమనియు చెప్పిరి. అంతట యాత్రికులు పెంటపాడుగ్రామము వదలిరి.

### శ్రీ శ్రీనివాస గ్రంథాలయము, పెంటపాడు.

క్రిందటి సంవత్సరము తమ తండ్రిగారి స్మారకచిహ్నముగా శ్రీ వింజమూరి నరసింహాచార్యులుగారిచే నిర్మాణము చేయబడినది. దీని కగు ఖర్చు సగము తామే భరించుచున్నారు. పది పత్రికల వరకు తెప్పించుచున్నారు. 6 బీరువాలతో అమూల్యములగు ఆంధ్రాంగ్లగీర్వాణహిందీ పుస్తకములు 1245 కలవు. ఇంతవదాన్యముతో గ్రంథాలయోద్యమమునకు తోడ్పడిన శ్రీ నరసింహాచార్యులుగారు ధన్యులు. గ్రంథాలయము మహాభివృద్ధిలో నున్నదనుట కమితానందముగ నున్నది. యాత్రికులు భజనతో గ్రామసంకీర్తనము గావించిన యనంతరము సాయంత్రము 6 గంటలకు శ్రీ... రాజగోపాలరావుగారిఅధ్యక్షతను బహిరంగసభ జరుపబడెను. డా. తేతలి సత్యనారాయణమూర్తిగారు గ్రంథాలయచరిత్రను గురించియు, శ్రీ అయ్యంకి వేంకటరమణయ్యగారు గ్రంథాలయము నేవిధముగ నుపయోగించుటను గురించియు, శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్యగారు గ్రంథాలయ ప్రయోజనమును బడసి నూతనజాతిని సృష్టించవలెననియు, శ్రీ చింతలపాటి లచ్చిరాజుగారు గ్రంథాలయప్రయోజనమును గూర్చియు ప్రసంగించిరి. అధ్యక్షులు గ్రంథాలయముల నుపయోగపరచుకొనుట ప్రతివాని విధియనియు నుద్బోధించిరి. అతిథులకు, అధ్యక్షులకు గ్రంథాలయముతరఫున శ్రీ జగన్నాథాచార్యులవారిచే వందనములు సమర్పించుటతో సభ ముగింపు గావింపబడెను. సభానంతరము శ్రీ ఉప్పుగల్లు లక్ష్మీనారాయణగారు మ్యాజిక్ లాంతరు మూలముగ గ్రామ పునర్నిర్మాణమును గురించి ప్రజాప్రబోధ మొనర్చిరి. ఆరాత్రి అటనే యుండి యాత్రికులు మరుదినము చిలకలంపాడు (చెలుసుగనము) గ్రామము వదలిరి.

### శ్రీ చంద్రశేఖర పుస్తకభాండాగారము, చెలుసుగనము.

1915 వ సంవత్సరములో ప్రారంభింపబడి ఒకవిధమగు అభివృద్ధితో ఇప్పటికి 375 పుస్తకములను గలిగి గ్రామ పంచాయతీయాజమాన్యమున నిర్వహింపబడుచున్నది. ఈ పంచాయతీవారు గ్రంథాలయవిషయమై, తద్వరాళీముల విషయమై ప్రభుత్వముతో కొంత చర్చను గావించి

ప్రయోజనము పొందలేకపోయిరి. ఇది కొంత నిరుత్సాహము కలిగించినను ప్రస్తుతము సక్రమముగ నిర్వహింపబడుచునే యున్నది. భజనతో గ్రామసంకీర్తనము గావించిన యనంతరము, గ్రామఫోనుసంగీతానంతరము బహిరంగ సభ గావింపబడెను. స్థానికపంచాయతీకోర్టు ఉపాధ్యక్షులగు శ్రీ విష్ణుకర్ఝుల రామయ్యగారు అధ్యక్షత వహించిరి. శ్రీ ఇందుకూరి సత్యనారాయణరాజుగారు, వావిలాల గోపాలకృష్ణయ్యగారు, చింతలపాటి లచ్చిరాజుగారు వేగేశన సూరపరాజుగారు గ్రంథాలయోపయోగములను గురించి ప్రసంగించిరి. సభానంతరము శ్రీ ఉప్పల్ల లక్ష్మీనారాయణగారిచే మ్యాజిక్‌లాంతరుప్రదర్శనము గావింపబడిన యనంతరము యాత్రికులు సాయంత్రమునకు పిప్పర గ్రామము చేరిరి.

## శ్రీ గాంధిపుస్తకభాండాగారము, పిప్పర.

1915 సంవత్సరము శ్రీమంగిపూడిసోదరులచే ప్రోత్సాహముచే కీ.శే. బంగారాజుగారిచే స్థాపింపబడి 1928 వ సంవత్సరములో గ్రామపంచాయతీబోర్డువారిచే పునరుద్ధరింపబడి సక్రమముగా నిర్వహింపబడుచున్నది. ఇందు 496 పుస్తకములును, 8 పత్రికలును అలంకరించుచున్నవి. నిత్యము 20 మందికి పైగా చదువుచుందురు. శ్రీ ఇందుకూరి సుబ్బరాజుగారి అధ్యక్షతను గ్రంథాలయావరణమున బహిరంగ సభ జరుపబడెను అధ్యక్షులు పుష్పమాలాలంకృతులు గావింపబడిన యనంతరము శ్రీవావిలాల గోపాలకృష్ణయ్యగారు గ్రంథాలయప్రయోజనమువలన లాభించిన వ్యక్తులను గురించి విపులముగా వివరించిరి. తదనంతరము వేగేశన సూరపరాజు, చింతలపాటి లచ్చిరాజు, దేచిభట్ల వెంకటేశ్వర్లు, పమ్మి వెంకయ్యగార్లు గ్రంథాలయప్రయోజనములగురించి ప్రసంగించిరి. శ్రీఉప్పల్ల లక్ష్మీనారాయణగారిచే మ్యాజిక్‌లాంతరు ప్రదర్శనము గావింపబడిన యనంతరము సభ ముగింపబడెను. అవార్డుచటనే గడిపిరి. శ్రీ ఇందుకూరి సుబ్బరాజుగారి సేవ ప్రశంసనీయము.

## శ్రీ భారతీహిందీగ్రంథాలయము, పిప్పర.

1933 వ సంవత్సరములో స్థానిక హిందీప్రేమమండలి వారిచే స్థాపింపబడి 160 గ్రంథములతోడను కలిగలుగు లేని హిందీప్రచారానికి పనిచేయుచున్నది. ఇందు 30 మంది సభ్యులుగలరు. వార్తాసంగ్రహము నిత్యము అట్టలపై వ్రాసి అందరకు సులభగ్రాహ్యము చేయబడుచున్నది. ఈగ్రంథాలయమున హిందీవాగ్వర్ధనీసభతోపాటు ఆంధ్రభాషయందును చర్చలు జరుపప్రయత్నించిన ఆంధ్రాభ్యుదయము నాకాంక్షించినవారగుదురు. యాత్రికులు నాడు (8 వ తేదీ) 8 గంటలకు కేశవరము చేరిరి.

## శ్రీ సీతారామ పుస్తకభాండాగారము, కేశవరము.

1928 వ సంవత్సరమున ప్రారంభింపబడి నేటికి 293 గ్రంథములతోడను, రెండుమూడు పత్రికలతోడను నిత్యము 25 మందికిపైగా చదువరులతోడను(సక్రమముగ నడచుచున్నది) పంచాయతీబోర్డుచే నిర్వహింపబడుచున్నది. దాదాపుగా 8000 విలువగల స్వంతభవనమును తయారుచేయుచున్నారు. గ్రామములో నందరును ప్రజాసేవాభిరతులై యుండుటచే మంచికృషి గావించుచున్నారు. గ్రామమునందలి నాలుగు ముఖ్యస్థలములలో సిమెంటుబల్లల నేర్పరచి ఏనాటికానాడు వార్తాసంగ్రహమును వ్రాసి తన సమాచారముపై తాను వెదలుచుండ ప్రతివ్యక్తికిని సుబోధకము గావించుట ప్రశంసనీయము. గ్రంథాలయప్రదర్శనము గావింపబడెను. గ్రామోఫోనుసంగీత కాలక్షేపానంతరము శ్రీ చింతలపాటి లచ్చిరాజుగారి అధ్యక్షతను బహిరంగ సభ గావింపబడెను. శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య, తల్లాప్రగడ భీమేశ్వరరావు, అయ్యంకి వెంకటరమణయ్య పంతులుగార్లు గ్రంథాలయములవలనిప్రయోజనములు - అవి పొందు విధానము - గ్రంథాలయోద్యమమును గురించియు నుపన్యసించిరి. శ్రీ కలిదిండి గంగరాజుగారు (పాత తాలూకా బోర్డు అధ్యక్షులు) రైతులు - కూలిజనులకు విద్యయెంత అవసరమో వివరించుచు నుపన్యసించిరి. అధ్యక్షుని తుదిపలుకులతో సభ ముగింపు గావింపబడెను. తదనంతరము శ్రీ ఉప్పల్ల లక్ష్మీనారాయణగారిచే మ్యాజిక్ లాంతరు ప్రదర్శనము గావింపబడెను. అచటినుండి యాత్రికులు శ్రీ కలిదిండి గంగరాజుగారితో కాకినాడ గ్రామమునకు వెడలిరి.

## శ్రీ వేణుగోపాల గ్రంథాలయము - కాకినాడ.

1917 లో 700 పుస్తకములతో స్థాపింపబడి ఒక దశాబ్దము మహోత్సాహప్రదముగ నిర్వహింపబడెను. ఇప్పుడది వెతుకబడిన దశతప్పను. వారు వీరు తీసుకొనిపోగా ఇప్పటికి 200 పుస్తకములు నిల్వకలవు. గ్రామజనులలో ఒక సంవత్సరమునుండి గ్రంథాలయమును పునరుద్ధరించవలెనని తీవ్రోత్సాహము బయలుదేరినది. అనాడీనాడని కాలము గడపుచురాగా నేడీ యాత్రికులు వచ్చుటచే తన్మహోత్సాహరము నేటికన్న మరెన్నడని పునరుద్ధరింపబడెను. నూతన కార్యనిర్వాహకవర్గమెన్నికలు జరుపబడెను. శ్రీ కలిదిండి

గంగరాజుగారి అధ్యక్షతను బహిరంగసభ జరుపబడెను. శ్రీ అయ్యంకి వెంకటరమణయ్య, వావిలాల గోపాలకృష్ణయ్య శ్రీ తల్లాప్రగడ భీమేశ్వరరావుగార్లు గ్రంథాలయప్రయోజనములనుగురించి యుపన్యసించిరి. తరువాత శ్రీ ఉప్పెర్ల లక్ష్మీనారాయణగారి మ్యాజిక్ లాంతరు ప్రదర్శనానంతరము గ్రామపునర్నిర్మాణమునుగురించి వివరించిరి. ఆరాత్రి అచటనే కాలక్షేపము గావించి మరుదినముదయమునకు మీనవిల్లూరు గ్రామమునకు చేరిరి.

## శ్రీ తిక్కన గ్రంథాలయము - మీనవిల్లూరు.

యాత్రికు లిచటికి వచ్చిరి. సంగతిసందర్భముల నాలోచించిరి. సక్రమముగ గ్రంథాలయము లేనికొరంతను గుర్తించిరి. బహిరంగసభ జేయనిర్ణయించిరి. గ్రామఫోను సంగీత కాలక్షేపము గావించినయనంతరము శ్రీ తల్లాప్రగడ భీమేశ్వరరావుగారి అధ్యక్షతను సభ జరుపబడెను. శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య, అయ్యంకి వెంకటరమణయ్య గార్లు గ్రంథాలయోపయోగములగురించి యుపన్యసించిరి. అధ్యక్షుని తుదిపలుకులతో సభముగించిరి. యువకులలో నుత్సాహము పురికొల్పగా గ్రంథాలయము లేనికొరత ననుభవించుచున్నామనియు తప్పక గ్రంథాలయము స్థాపింప నేర్పాటుచేసెదమనియు నుడివిరి. శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్యగారిచే తిక్కన గ్రంథాలయ మనుపేరిట శ్రీముదిగంటి సూర్యనారాయణగారధ్యక్షులుగను మల్లం సూర్యారావుగారు కార్యదర్శిగను, ఏర్పడిన సంఘముతో ప్రారంభింపబడెను.

## పంచాయతీ గ్రంథాలయము - మీనవిల్లూరు.

ఇది నామకః పంచాయతీవారిచే కొలది గ్రంథములతో నొక గ్రంథాలయముస్థాపించికొలది ప్రయోజనముమాత్రమే జరుపబడుచుండెను. యాత్రికు లచటనుండి గ్రామపంచాయతీబోర్డు అధ్యక్షులు వచ్చి తీసికొనిపోగా కోరుమిల్లిగ్రామము వదలిరి.

## సరస్వతీ గ్రంథాలయము - కోరుమిల్లి.

ఇచట గ్రంథాలయ మిదివరలో లేదు. కాని ప్రజలలో నధికోత్సాహమును కాంక్షయును నున్నది. ఇదివరలో ఆంధ్రదినపత్రిక తెప్పించుకొని నిత్యము అందరును ముఖ్యముగ చదువుచునేయున్నారు. భజనతో గ్రామసంకీర్తనము గావించిన యనంతరము గ్రామఫోనుసంగీతకాలక్షేపము గావింపబడెను. శ్రీ తల్లాప్రగడ భీమేశ్వరరావుగారి అధ్యక్షతను బహిరంగసభ జరుపబడెను. శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య అయ్యంకి వెంకటరమణయ్యగార్లు గ్రంథాలయ ప్రయోజనములనుగురించి వివరముగ నుపన్యసించిరి. అధ్యక్షులును గ్రంథాలయప్రయోజనమునుగురించి వివరించిన యనంతరము శ్రీ సరస్వతీదేవి పేరిట దాదాపు 80 పుస్తకములతో నూతనముగా గ్రంథాలయము స్థాపింపబడెను. గ్రంథాలయ ప్రదర్శనము గావింపబడిన యనంతరము శ్రీ ఉప్పెర్ల లక్ష్మీనారాయణగారిచే మ్యాజిక్ లాంతరు ప్రదర్శన మివ్వబడెను. అచటినుండి రాత్రికి యాత్రికులు కాశిపాడుగ్రామము చేరిరి.

## శ్రీ పంచాయతీ గ్రంథాలయము, కాశిపాడు.

1926 లో స్థాపితమై ఒకవిధముగు ప్రబోధప్రచారములతో నిర్వహింపబడుచు ఈమధ్యనే అందులకై భాండారి నేర్పాటుగావించి ప్రస్తుతము సక్రమముగ నిర్వహించుచున్నారు. ఇందు 266 పుస్తకములును ఒకటి రెండు పత్రికలునుకలవు. గ్రామపంచాయతీచే నిర్వహింపబడుచున్నది. రాత్రి శ్రీ కలిదిండి బాపిరాజు, బి. ఎ., బి. యల్. గారి అధ్యక్షతను బహిరంగసభ జరుపబడెను. గ్రామఫోను సంగీత కాలక్షేపము గావింపబడెను. శ్రీ అయ్యంకి వెంకటరమణయ్య, వావిలాల గోపాలకృష్ణయ్య తల్లాప్రగడ భీమేశ్వరరావు, ఇందుకూరి సత్యనారాయణరాజు, అడివికొలను సూరయ్యగార్లును అధ్యక్షులును గ్రంథాలయోపయోగములనుగురించి వివరముగ నుపన్యసించిన యనంతరము శ్రీ ఉప్పెర్ల లక్ష్మీనారాయణగారి వలన మ్యాజిక్ లాంతరు ప్రదర్శనము గావింపబడెను. ఆరాత్రి అచటనే గడిపి మరుదినముదయము బోడపాడు చేరిరి.

## పంచాయతీ గ్రంథాలయము, బోడపాడు.

1927 లో స్థాపింపబడి అమూల్యములగు ఆధ్యాత్మిక సాహిత్యగ్రంథరత్నములు 563 కు పైగాగలిగి అన్నిపుస్తకములును శాశ్వతముగ నుండువిధమున బైండు చేయించి పదిలముగ బీరువాలయందుంచిరి. వానిని తగినవిధముగ నుపయోగించుటలేదు. ఇచట నందరును అగ్రహారికులు, బ్రాహ్మణులు, ఈనడుమ మరల నూతనోత్సాహము బయలుదేరి కొలదిమాసములనుండి కొంతపని జరుగుచున్నది. పత్రిక లేమియును తెప్పింపబడుటలేదుగాని ఆంధ్రదినపత్రిక, కృష్ణాపత్రిక మొదలగు కొన్నిపత్రికలు తెప్పించుటకు వాగ్దానములు జరిగెను. గ్రంథాలయప్రదర్శనము గావింపబడెను. గ్రామఫోను సంగీతకాలక్షేపానంతరము శ్రీ చీమలకొండ సూర్యనారాయణశాస్త్రిగారి అధ్యక్షతను బహిరంగసభ జరుపబడెను. శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య, అయ్యంకి

వెంకటరమణయ్య, అడవికొలను సూరయ్య, తెల్లాప్రగడ భీమేశ్వరరావుగార్లును అధ్యక్షులును గ్రంథాలయోపయోగములనుగురించి గంభీరముగను విపులముగను నుపన్యసించిరి. తదనంతరము మ్యాజిక్‌లాంతరు ప్రదర్శనము ఉప్పల్ల లక్ష్మీనారాయణగారిచే జరుపబడెను. యాత్రికులు భోజనానంతరము చింతపల్లి అగ్రహారము జేరిరి.

### శ్రీ భీమేశ్వర గ్రంథాలయము, చింతపల్లి.

1926 లో స్థాపింపబడి దాదాపు 200 పైగా మంచి మంచిపుస్తకములతో నలరారుచున్నది. గ్రామమును లోని నిరుత్సాహమువలన తగుపని జరుగుటలేదు. గ్రామపంచాయతీ స్వాధీనములో నున్నది. ఆగ్రంథాలయమును తగువిధమున పునరుద్ధరించి ఒకగదిలో నిరంతరము ఎట్టిఅభ్యంతరమును లేకుండ ప్రజలందరును ఉపయోగపరచుకొను నవకాశముండువిధమున ఏర్పాటుగావించి ప్రబోధము గావింపబడెను. శ్రీ సామవేదం రామస్వామి శాస్త్రిగారి అధ్యక్షతను బహిరంగసభ జరుపబడెను. గ్రామఫోనుసంగీతకాలక్షేపము గావింపబడెను. శ్రీ తెల్లాప్రగడ భీమేశ్వరరావు, అడవికొలను సూరయ్య, సామవేదం సుబ్రహ్మణ్యం. (బి. ఏ), వావిలాల గోపాలకృష్ణయ్య, అయ్యంకి వేంకటరమణయ్య, ఇందుకూరి సత్యనారాయణరాజు గార్లును, అధ్యక్షులును గ్రంథాలయోపయోగములను గురించి వివరముగ నుపన్యసించిరి. తరుపరి శ్రీ ఉప్పల్ల లక్ష్మీనారాయణగారిచే మ్యాజిక్‌లాంతరు ప్రదర్శనము గావింపబడెను. వెంటనే యాత్రికు లచటినుండి రావిపాడు గ్రామమును జేరిరి.

### శ్రీ రామలింగేశ్వర పుస్తకభాండాగారము, రావిపాడు.

1919 వ సంవత్సరమున ఆంధ్రమహాసభీయుల సత్కారాదార్యములచే నొసంగబడిన 500 గ్రంథములతో స్వంతముగ నిర్వహించుచుండిన గ్రంథాలయము ఒక మాదిరిగ పనిచేయుచున్నది. అంతతో సంతృప్తి లేక యింకను అభివృద్ధినందవలయుననియు ప్రజాస్వత్వము కావలెననియు గ్రంథాలయము పంచాయితీబోర్డునకు స్వాధీనపరచుచు పునరుద్ధరింపబడెను. కొన్నిపత్రికలును తెప్పింపబడుచున్నవి. గ్రామఫోనుపాటలు జరుపబడెను. తదనంతరము శ్రీ కోటి అప్పారావుగారి అధ్యక్షతను బహిరంగసభ జరుపబడెను. అందు శ్రీ అయ్యంకి వేంకటరమణయ్య, తెల్లాప్రగడ భీమేశ్వరరావు, ఇందుకూరి సత్యనారాయణరాజు, అడవికొలను సూరయ్య, వావిలాల గోపాలకృష్ణయ్య, విశాల విశ్వనాథశాస్త్రిగార్లును, అధ్యక్షులును, గ్రంథాలయోద్యమావశ్యకత, తద్వ్యాప్తి, తద్విధానములు వివరముగ నుపన్యసింపబడెను. శ్రీ ఉప్పల్ల లక్ష్మీనారాయణగారిచే మ్యాజిక్‌లాంతరు ప్రదర్శనము గావింపబడెను. స్త్రీలును పురుషులును దాదాపు వెయ్యమంది పైగా వచ్చుట ఉత్సాహజనక మగుచుండెను. యాత్రికు లారాత్రి అచటనే గడపి మరుదినముదయము రాచర్ల గ్రామము జేరిరి.

### శ్రీ రామదాసు గ్రంథాలయము, రాచర్ల.

1926 లో ఊరునుచేరను లేకుండ నొకగ్రంథాలయమును స్థాపించి అందరకును జదివి వినిపించుచు, జదివించియు గ్రంథాలయప్రచారము జరుగుచున్న వ్యక్తిగ్రంథాలయమును యాత్రిక దర్శనమున పంచాయతీస్వాధీనపరచి ధర్మగ్రంథాలయము గావించిరి. ఆంధ్రసత్కీర్తిస్ఫూర్తమగు ఆంధ్రభక్తాగ్రేసరు డగు శ్రీ కంచర్ల గోపన్నగారి పేర రామదాసగ్రంథాలయ మని నామ మిడి 180 పుస్తకములతో ప్రారంభింపబడెను. శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్యగారి అధ్యక్షతను బహిరంగసభ జరుపబడెను. శ్రీ డాక్టరు తేతలి సత్యనారాయణమూర్తి, అడవికొలను సూరయ్య, తెల్లాప్రగడ భీమేశ్వరరావు, అయ్యంకి వేంకటరమణయ్యగార్లును, అధ్యక్షులును విరళముగ గ్రంథాలయోపయోగముల వివరించుచు నుపన్యసించిరి. తుదకు శ్రీ ఉప్పల్ల లక్ష్మీనారాయణగారిచే మ్యాజిక్‌లాంతరు ప్రదర్శనము గావింపబడెను. అంతట యాత్రికులు మధ్యాహ్నమునకు అలంపురము జేరిరి.

### శ్రీ పంచాయతీ గ్రంథాలయము, అలంపురము.

1933 లో స్థాపింపబడి ప్రతినిత్యము ఆంధ్రపత్రిక తెప్పించి చదివివినిపించుచు 439 పుస్తకములతో నలరారునట్టి అనుదిన గ్రంథాలయము గ్రామచావడిలో నిర్వహింపబడుచున్నది. ప్రజలలో నుత్సాహముకూడ కానిపించుచున్నది. అభివృద్ధియగు సూచనలు బహుళముగ నున్నవి. శ్రీ గోరట్ల చినవెంకట సోమరాజుగారి అధ్యక్షతను బహిరంగసభ జరిగెను. గ్రామఫోను సంగీతకాలక్షేపము తరువాత శ్రీ తెల్లాప్రగడ భీమేశ్వరరావు, అయ్యంకి వేంకటరమణయ్య, వావిలాల గోపాలకృష్ణయ్య, అడవికొలను సూరయ్యగార్లు గ్రంథాలయోపయోగములనుగురించి వివరముగ నుపన్యసించిరి. తదనంతరము శ్రీ ఉప్పల్ల లక్ష్మీనారాయణగారిచే మ్యాజిక్‌లాంతరు ప్రదర్శనము గావింపబడెను. అచటి నుండి సాయంత్రమునకు కృష్ణాయపాలెము గ్రామము జేరిరి.

### శ్రీ పంచాయతీ గ్రంథాలయము, కృష్ణాయపాలెము.

1928 లో దాదాపు 500 పుస్తకములతో స్థాపింపబడి ఒక మాదిరిగా నిర్వహింపబడుచున్నది. పత్రికలు వగైరా ఏమియు వచ్చుచున్నటుల లేదు. యాత్రికులు వత్తురని తెలిసియు కారణాంతరములచే నొకవేళ గ్రామాంతరము వెడలినను గ్రంథాలయమును చూచు నవకాశమును యాత్రికులకు కలుగజేయని అధ్యక్షుల చర్య శోచనీయము. గ్రామమునకు యాత్రికులు విచ్చేసి రాత్రి గ్రామసంకీర్తనము గావించిన యనంతరము శ్రీ ఉప్పల్ల లక్ష్మీనారాయణ గారిచే మ్యాజిక్ లాంతరు ప్రదర్శనము జరుపబడెను. తదనంతరము శ్రీ తల్లాప్రగడ భీమేశ్వరరావుగారి అధ్యక్షతను బహిరంగసభ జరుపబడెను. శ్రీ అధ్యక్షులు వావిలాల గోపాలకృష్ణయ్యగారు గ్రంథాలయ ప్రయోజనములను గురించి వివరముగ నుపన్యసించిరి. తదనంతరము గ్రామఫోను సంగీతకాలక్షేపము జరుపబడెను. ఆరాత్రి అటనే యుండి యాత్రికులు మరుదిన ముదయమున జగన్నాథపురము వెడలిరి.

### శ్రీ మల్లేశ్వర గ్రంథాలయము, జగన్నాథపురము.

1916 వ సంవత్సరములో స్థాపింపబడి ఈనడుమ జీర్ణదశకు వచ్చెను. కాని మరల నచట బయలుదేరిన యువకులు దానిని పునరుద్ధరించి సక్రమముగా నిర్వహించుచున్నారు. ఇప్పటికి 150 పుస్తకములు ప్రోగుచేయబడినవి. కొన్ని పత్రికలు వచ్చుచున్నవి. ఇంకను ప్రాతగ్రంథాలయము తాలూకు పుస్తకములు వసూలు చేయుచున్నారు. యాత్రికులు భోజనానంతరము గ్రామసందర్శనము గావించి గ్రామఫోనుపాటలు ముగించిన తరువాత శ్రీ కూచిభొట్ల శ్రీరామమూర్తి (తాలూకా ఆరోగ్యశాఖాధికారి) గారి అధ్యక్షతను బహిరంగసభ జరుపబడెను. శ్రీ అయ్యంకి వేంకటరమణయ్య, వావిలాల గోపాలకృష్ణయ్యగార్లు గ్రంథాలయోపయోగమును గూర్చియు, అధ్యక్షులు ఆరోగ్యవిధులను గురించియు నుపన్యసించిరి. శ్రీ ఉప్పల్ల లక్ష్మీనారాయణగారిచే మ్యాజిక్ లాంతరు ప్రదర్శనము గావింపబడెను. అచటినుండి యాత్రికులు సాయంత్రము 4 గంటలకు మాధవరము గ్రామము చేరిరి.

### శ్రీ భారతీ పుస్తక భాండాగారము, మాధవరము.

1918 లో స్థాపింపబడి అనేకమంది పెద్దలను పిలిపించి యుపన్యాసము లిప్పించియు. వార్షికోత్సవముల జరిపియు నుత్సాహముతో నిర్వహించుచున్నారు. ప్రస్తుతము జిల్లా బోర్డువారికి స్వాధీనపరుపదలంచి యున్నారు. జిల్లాబోర్డు గ్రామపంచాయతీవారు సుమారు రు 8000 ల విలువగల భవనమును గట్టించుచున్నారు. కొలదిదినములలో భవన ముపయోగార్హము కాగలదు. ఇందు 1769 పుస్తకములతోడను రెండుమూడు పత్రికలతోడను నిత్యము 20 మందికి పైగా చదువరులతోడను నలరారుచున్నది. స్థానిక ప్రార్థనా మందిరము (బ్రహ్మసమాజము) నందు శ్రీ తమ్మిశెట్టి వీరన్నగారి అధ్యక్షతను బహిరంగ సభ జరుపబడెను. శ్రీ అయ్యంకి వేంకటరమణయ్యగారు, వావిలాల గోపాలకృష్ణయ్యగార్లు గ్రంథాలయప్రయోజనములను గూర్చియు, మతసామరస్యమును గురించియు నుపన్యసించిరి. రాత్రి పంచాయతీబోర్డు ఆఫీసు ఆవరణమందు ఉప్పల్ల లక్ష్మీనారాయణగారిచే మ్యాజిక్ లాంతరు ప్రదర్శనము జరుపబడెను. స్త్రీపురుషులు దాదాపు వెయ్యిమంది వచ్చిరి. స్థలము చాలక యిండ్లకును గొందరు వెడలిరి. ఆరాత్రి అచటనే కాలక్షేపము గావించి మరుదినముదయమున దండగర్ర గ్రామమునకు యాత్రికులు వెడలిరి.

### శ్రీకృష్ణ గ్రంథాలయము, దండగర్ర.

1933 లో స్థాపింపబడి నిరంతరాభివృద్ధితోడను యువజనుల ఆదరముతో నుత్సాహముతోడను 753 ఆంధ్రాంగ్లహిందీ గ్రంథములతోడను నిత్యము 20 మందికి పైగా చదువరులతోడను వయోజన విద్యాభివృద్ధికి దోహదప్రాయమగు రాత్రిపాఠశాల తోడను నలరారుచున్నది. గ్రామము చాల అభివృద్ధికరముగ నున్నది. గ్రామములో సామాజిక భవనమనదగిన పాఠశాలకు, సత్రమునకు భజనమందిరమునకు, పలువురు సమావేశమగుటకు అనువగు వైశాల్యముగల హాలును కలిగిన గొప్ప గ్రామపు ఉమ్మడిభవనమున గ్రంథాలయమునకును శాశ్వతానుభవాకాశముతో నొక పెద్దగది యివ్వబడి అందిపుడు గ్రంథాలయమున్నది. ప్రక్కనే చెరువును దేవాలయమును కలవు. ఇది ఆదర్శప్రాయమన చెల్లును. అచట గ్రామఫోను సంగీతకాలక్షేపానంతరము బహిరంగసభ జరుపబడి శ్రీ అయ్యంకి వేంకటరమణయ్య వావిలాల గోపాలకృష్ణయ్య గార్లు గ్రంథాలయ ప్రయోజనములను గురించి యుపన్యసించిరి. శ్రీ ఉప్పల్ల లక్ష్మీనారాయణగారిచే మ్యాజిక్ లాంతరు ప్రదర్శనము గావింపబడెను. అచటినుండి యాత్రికులు నవాబ్ పాలెం వెడలిరి.

### శ్రీ పంచాయతీ గ్రంథాలయము-నవాబ్ పాలెము.

1929 వ సంవత్సరమున స్థాపింపబడి ఒక విధముగ నున్నది. ఇందు 150 పుస్తకములు కలవు. పంచాయతీ వారు దానిని సక్రమముగ నుపయోగింప జేసినటుల

గావించుటలేదు. అచట సాయంత్రము భజనతో గ్రామ సంకీర్తనము గావింపబడిన యనంతరము బహిరంగసభ జరుపబడెను. శ్రీ డాక్టరు తేతలి సత్యనారాయణమూర్తి అయ్యంకి వేంకటరమణయ్య, దద్దనాల లక్ష్మీసత్యనారాయణ, వావిలాల గోపాలకృష్ణయ్యగారలు గ్రంథాలయ ప్రయోజనములను వివరించుచు నుపన్యసించిరి. శ్రీ ఉప్పల లక్ష్మీనారాయణగారిచే మ్యాజికులాంతరు ప్రదర్శనము గావింపబడెను. అచటినుండి యాత్రికులు పోతవరము ప్రయాణముగట్టి మార్గమధ్యమున తాడేపల్లిగూడెమునకు రైలుపై వెడలిరి. మరుదినము (14-3-35 గురువారము) యాత్రికులు పోతవరమునకు 10 గంటలకు జేరిరి.

## బాలసరస్వతీ గ్రంథాలయము - పోతవరము.

1929 వ సంవత్సరమున ప్రారంభింపబడి దినదినాభివృద్ధితో నేటికి 702 పుస్తకములతోడను సంవత్సరమునకు 294 పుస్తకములు చదవబడుటతోడను నిత్యము 15 మందికి పైగా చదువరులతోడను నాలుగువార్తాపత్రికలతోడను నలరారుచు గ్రామ పంచాయతీచే నిర్వహింపబడుచున్నది. గ్రామములో యువకులయందుత్సాహము అధికముగ గానుపించుచున్నది. ఇచట రామమందిరమున యాత్రికులకు సభ యేర్పాటుగావించి పురప్రముఖులు యాత్రికులను సన్మానించి భజనతో గ్రామసంకీర్తనముతోడ దీసికొని వెడలిరి. శ్రీ డాక్టరు తేతలి సత్యనారాయణమూర్తిగారు ప్రథమమున యాత్రోద్దేశములను వివరించిరి. శ్రీ అయ్యంకి వేంకటరమణయ్యగారు గ్రంథాలయములను గ్రామస్థు లెటు లభివృద్ధిచేయదగునో వివరించిరి. శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్యగారు గ్రంథాలయప్రయోజనములను గురించి 2½ గంటలు గంభీరోపన్యాసము గావించిరి. శ్రీ అడవికొలను సూరయ్యగారు జ్ఞానావశ్యకతను వివరించిరి. శ్రీ దద్దనాల లక్ష్మీసత్యనారాయణగారు వందనములు సమర్పించుటతో సభ ముగింపుగావింపబడెను. అంతట యాత్రికులు సాయంత్రమునకు అనంతపల్లి గ్రామము జేరిరి.

## శ్రీ శేషాద్రిగ్రంథాలయము, అనంతపల్లి.

ఇచట నవయౌవనోత్సాహపూరితులగు యువకులు కలరు. అందులో శ్రీ ఉద్దగిరి శేషగిరిరావుగారు ప్రశంసాపాత్రులు. మొక్కవోవని, వెనుకంజవేయని దేశాభిమానరతులు. గ్రామములోనికి యాత్రికులు రాగనే వారినన్నివిధముల నాదరించి బహిరంగసభ జరుపబడెను. శ్రీ అయ్యంకి వేంకటరమణయ్య వావిలాల గోపాలకృష్ణయ్యగార్లు గ్రంథాలయ ప్రయోజనములనుగూర్చి విపులముగ నుపన్యసించి యుద్బోధించినయనంతరము 150 పుస్తకములతోడను నాలుగైదుపత్రికలతోడను నూతనగ్రంథాలయము స్థాపింపబడెను. భవనపుటేర్పాటులు జరుగుచున్నవి. చాలా ఉత్సాహము ప్రజ్వరిల్లినది. ఆనాటికి యాత్రికు లచటనే యుండి మరుదిన ముదయము నల్లచర్లగ్రామము జేరిరి.

## శ్రీ వేణుగోపాల గ్రంథాలయము - నల్లచర్ల.

యాత్రికులు వత్తురని తెలిసి ముందుగనే 150 పుస్తకములు పైగా సమకూర్చి కార్యక్రమములో లేకున్నను నూతనముగ నాహ్వానించి అతిథిసత్కారాదులతో నాదరించి భజనతో గ్రామసంకీర్తనము గావించినయనంతరము శ్రీ అయ్యంకి వేంకటరమణయ్యగారి అధ్యక్షతను బహిరంగ సభను గావించి 20 మంది సభ్యులతోడను రెండుపత్రికలతోడను 150 పుస్తకములతోడను రు 30—0—0 ల చందాలతోడను నూతనోత్సాహముతో గ్రంథాలయమును స్థాపించిరి. ప్రజలయందధికోత్సాహము ప్రకోపింపజేయగలిగిరి. అచటినుండి యాత్రికులు దూబచర్లగ్రామము వెడలిరి.

## గ్రంథాలయప్రయత్నము - దూబచర్ల.

కారణాంతరములచే గ్రామాంతరము వెడలియుండుటచే నూతన గ్రంథాలయస్థాపనమునకు వలనుపడినదికాదు. గ్రంథాలయము స్థాపనము కాలేదుకాని భవనము ముందుగనే యేర్పాటుగావింపబడుచున్నదనిన నెంతో సంతసము జనింపక మానదు. యాత్రికు లచటికి జేరి గ్రామసంకీర్తనము గావించిన యనంతరము శ్రీ వంకదారు సుబ్బయ్యశ్రేష్ఠిగారి అధ్యక్షతను శ్రీ రామమందిరమున బహిరంగసభ జరుపబడెను. శ్రీ దద్దనాలలక్ష్మీసత్యనారాయణ, వావిలాలగోపాలకృష్ణయ్య, అడవికొలను సూరయ్యగార్లు గ్రంథాలయ ప్రయోజనములను గురించి, తదావశ్యకతను గురించి ప్రబోధించిరి. ఉత్సాహము బయలువెడలజేయగలిగిరి. ఆవశ్యకతను గమనించిరి. త్వరలో స్థాపితము కాగలదని ఆశింపదగును. అచటినుండి యాత్రికులు మోటరుపై పెదతాడేపల్లిగ్రామము జేరిరి.

## శ్రీ సరస్వతీనిలయము, పెదతాడేపల్లి.

నూతన గ్రంథాలయప్రయత్నమునకై ప్రజలలో నిదివరకే ప్రబోధము గావించియుండిన శ్రీ డాక్టరు తేతలి సత్యనారాయణగారు యాత్రికులను కలిసికొనిరి. ప్రజలందరితో మాట్లాడిన యనంతరము శ్రీ ఉప్పల లక్ష్మీనారాయణగారిచే మ్యాజికులాంతరు ప్రదర్శనము గావింప

బడిన యనంతరము శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్యగారు గ్రంథాలయావశ్యకతను గురించియు, అజ్ఞానాంధకారవిచ్ఛేదనప్రయోజనమును గూర్చియు విపులముగ ప్రబోధాత్మకమగు నుపన్యాస మిచ్చిరి. అంతట ప్రజలచే రెండుపత్రికలు తెప్పించుటకును, కొన్నిపుస్తకము లిచ్చుటకును వాగ్దానములు కావింపబడెను. అంత శ్రీడాక్టరు తేతలి సత్యనారాయణగారు ఉత్సహించుచు నుపన్యసించిరి. కొలది గ్రంథములతో శ్రీ సరస్వతీనిలయము స్థాపింపబడెను. రాత్రి 9 గంటలకు యాత్రికులు తాడేపల్లిగూడెమునకు చేరిరి. ఆరాత్రి అచటనే కాలక్షేపము గావించి మరుదిన ముదయము యాత్రాదళమువారి ఛాయాచిత్రము తీయబడెను. అటుతరువాత బయలుదేరి రైలుప్రయాణికులు బాదంపూడిగ్రామము చేరిరి.

శ్రీ చిత్తరంజన గ్రంథాలయము, బాదంపూడి.

యాత్రయొక్క చివరిదినము 16-3-1935 శనివార ముదయము యాత్రికులు బాదంపూడి వదలిరి. అచటి పంచాయతీవారిచే నూతన గ్రంథాలయము ప్రారంభింపదగు నేర్పాటు లన్నియు చేయబడెను. భజనతో గ్రామసంకీర్తనము గావింపబడెను. నడివీథిలోని చావడియందు శ్రీ చింతలపాటి లచ్చిరాజుగారి అధ్యక్షతను బహిరంగసభ జరుపబడెను. శ్రీ ఇందుకూరి రామరాజుగారిచే ప్రార్థన గావింపబడిన యనంతరము గ్రామఫోను కాలక్షేపము గావింపబడెను. అంతట శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్యగారు గ్రంథాలయప్రయోజనములను గురించి వివరించిరి. శ్రీ అయ్యంకి వెంకటరమణయ్యగారు గ్రంథాలయ ప్రారంభోత్సవము జరుపుచు తదుపయోగములను అందు కనువగు విధములను వివరించుచు నుపన్యసించిరి. అంతట శ్రీ వితాల వీరభద్రరావుగారు, చింతలపాటి సూరపరాజుగారును గ్రంథాలయ ప్రయోజనములను గురించి యుపన్యసించిరి. అధ్యక్షుని తుదపలుకులతోను, అధ్యక్షులకు అతిథులకు శ్రీ నిడదవోలు శేషగిరిరావుగారి వందనసమర్పణముతోడను సభ ముగింపు గావింపబడెను. మధ్యాహ్నము పదునొకండుగంటలకు యాత్రికులు తమ యాత్రను సాగించి 46 గ్రామములు తిరిగి 51 గ్రంథాలయములను సందర్శించి గ్రంథాలయోద్యమమున కొక నూతనజీవనమును, ఉత్సాహమును, ఉత్తేజనమును ప్రజ్వలింపజేసి యాత్రను బయలుదేరదీసిన తాడేపల్లిగూడెమునకు చేరుటతో తమ యాత్రను జయప్రదముగ ముగింపుగావించిరి.

ఓం తత్ సత్.

---

# మారేపల్లి రామచంద్రశాస్త్రి

జ. సుబ్బారావుగారు.

రామచంద్రశాస్త్రిని తెనుఁగుతల్లి కన్న బిడ్డఁడనవలె. అయిదడుగుల మూఁడంగుళముల యెత్తు; అందుకు తగిన ఒత్తు ఒడలు ఉక్కువంటిది; చాయ చామన; నొసలు కడు వెడల్పు; ఎదుటివారినితనలోనికిలాగుకొను చల్లనిచూపు; ముప్పదియేండ్ల యీడువాఁడు కనుటకు బొద్దుమీసల మరాటిబాపఁడు; పరికించిన వెల్నాటి వైదికివాఁడు. పుట్టుచోటు- నల్లయేటిపట్టు కనకవల్లి. ఇది తెనుఁగునాటికి నడిపట్టు. వెనుక చలువ - ఒక చెల్లెలు, నల్వురుతమ్ములు. తొలిబిడ్డఁడు గంటుపోయె; మలిబిడ్డఁడు నేఁడు చల్లగా నున్నాఁడు. తండ్రి - వినికిడి (శ్రోత్రియుఁడు;) అతనిపొట్ట - కతలపుట్ట; పుక్కిలిపురాణాల ఊట బుగ్గ; చదువు - తొలిచదువు; బ్రతుకు - మేడి తోకము.

చిన్నతనమున ముద్దు లాలించి కన్నతల్లిని మూటఁగట్టించె. కలిమితల్లికి, పలుకులమ్మకు తన యందు మోజు పుట్టించె. పసిఁడితల్లి పెడఁబెట్టి, చదువులమ్మ చంక నెక్కె. ఆమెమప్పుమాటఁ జెప్పికొనుచు పయనము సాగించి కాకినాడను డిగియె అక్కడ చదువునకయి యిడుముల కుడిచె. పెద్దలజట్టునుండి తెలిపికి తెన్నుచూచె. జోగుల వేడి కొలిచె. వారిగుట్టు కనిపెట్టి అంటు వదల లేదనుకొనె. లోచూపునకు పునాదివేసె వడుగు

తనము పాటించె. తగులునకు గుఱి కాకుండ నుండఁగలిగె. పెద్దలకు నిక్కఁపు తెలివి చెప్పె. ఎఱుకకలిమిచే బడిలో చదువు సాగించుకొనె. చదువునందు చుఱుకు చూపి తోడిచట్టుల మించె. పలుకునఁ బరుగులెత్తె. కయితపాట ఉబికె.

పలుకుతల్లి బానిసతన ముడుగ పొగరోడ నెక్కి తూర్పునాఁటికి వెడలె. కడలిపొంత (విశాఖపట్టణము) విడిదిచేసె. పెద్దబడిలో చేరె. పెద్దయొజ్జమెప్పొంది 'కవి' బిరుదు నందె. నుడి తీర్పునందు తేఱుకొను తలంపునఁ జేరుతుదను 'శాస్త్రి' అని తానే తగిలించుకొనె. తగిలించుకొన్నందుకు తేటి పేరు నిలఁబెట్టుకొనె. నాఁటి బానిస తనఁపుబునికి తెలిసికొనె. డబ్బుకూర్పు పాడి కాదనుకొనె ఉసురుపస మందిపనికి వెచ్చింప నిరుకు చేసికొనె. గుట్టు కనుఁగొన దొరతనఁపు కొలువు కొలిచె. కాయము చేయ నక్కఱలేదని వదలుకొనె. కయితపాట బయలుదేఱఁగనిన వానినెల్లఁ బాడుచుండె నాటకము లాడనేర్చె. నట్టువలకు తగునట్లు వాని వ్రాసె. ఆడి, ఆడించి మందికి చవిగొల్పె. ఆటకాండ్రి దిద్దె. సానుల 'పదు పాటకము'ను మాన్ప నాటకము లాడు పనిఁబెట్టె. గిరీశతన మబ్బునట్లు దారికనఁబఱచె. పెక్కుమందికి పనిపాట్లు చెప్పించి బ్రతుకు తెరువు చూపె.

ఒజ్జయయి చట్టులఁ జక్కఁబఱిచె. పిల్లలయుల్లములు విప్పఁ దెలలఁ దాఁ జెప్పకయే వలయు దాని నడిగి వారివల్ల రాఁబట్టుచుండె. ఒప్పుల నిచ్చితల్లినికొలుచునట్లుమప్పిపంపుచుండె ఆఁడు పిల్లలకుఁ గూడ చదువు చెప్పింపుమనె. నాటి బాగునకు వారే మొదటివారనె. వెజ్జయి జబ్బుల గుదిర్చె. చుక్కల తెలివి కొంత పొందె. బీదపిల్లల చదువునకు డబ్బుకూర్చి సాయముచేసె. కుంటి గ్రుడ్డివాండ్ర నెయిదుకొన బువ్వలు పెట్టించె. చెడు అనువాయితుల (ఆచారముల) నవరింపఁ జూచె. మాలలఁ బైకి తెచ్చె. తెనుఁగుతనము నిలుప 'రాములీలల' నేర్పఱచె. నేఁడవి తూర్పునాఁడంతయుఁ బ్రాఁకె 'చేతిపనులు' బట్టలనేఁత' తిరిగి పుట్టఁజేసె. పనివాండ్రకు అండ యిచ్చె. తాను దండుగలో మునిఁగె. దరిచేరఁ దెన్నులు వెదకుచు నుఱుఁగుచుండె. నేలతల్లి అడ రుడుకు చెఱకు వెళ్లె; అక్కఱయైన ఊపిరి ఎఱఁబెట్టుమనె. పలుకుతల్లిగఁ బుట్టుబొట్టుజట్టు కూడె. పలుపలుకుల తొలిపొలుపు తెలపోసి మఱువులఁ దెలిసికొనె.

తెనుఁగుతల్లి నిక్కపుపొలుపు తెలిసికొన గుట్టుమట్టులన్నియు తెఱచి అరసె. అరసినవెల్ల అట్టపట్టి ఆనవాళ్లతోఁ జెప్పుచుండె. సొంత తెలివికనఁబఱచి ఉసురుజిగితో పలుకులల్ల నేర్చె. పలుకునకు పెఱవ్రాఁపు కూడదనె. కావలయు నన్నవారిఁ జూచి దిస్సవడును; ఎక్కటితనము నిలబెట్టనెట్టుకొనును; పచ్చిసింగారపు వ్రాఁతలకుచోటియఁగూడదనును; పలుకు తెలియునట్లు కూర్పుమనును; తెలియనిది పలుకు కాదనును; చదువరుల కంటునట్లు తాను పెక్కుపొత్తములు వ్రాసిచూపును; డబ్బునకయి పలుకులల్లకూడదనును; తెనుఁగు తెలివి తెన్నుకు మెట్లు కట్టుమనును; తెనుఁగుతల్లికి బానిసతనము బాపుమనును; ఆమెను గద్దెనెక్కించి మేటిపలుకు పెలందులపొంత నిలుపుమనును; పిల్లకవులకు ఊఁత నిమ్మనును; ఈసడించుట పండితతనము కాదనును. పొలితి నుడితీర్పు- నిందునుడికడలుల వ్రాయఁబట్టుకట్టె అందుకు పలుపలుకులు చదువుచు నేఁడున్న చట్టుతనము పాటించు. "నాఁటి

చాకిరీకి పోకయుండిన ఈపాటికి పలుకుబడి చూపియుండు అని పెక్కు రనుకొందురు.

మఱి - కూర్పునాటిది; పలుకు-పడమటిది. పేరునకు బాపఁడు; బింకమునకు రాచబిడ్డ. పడుచుతనమునకూడ నీటుగా మసలె. శ్రీశుకుని తరువాతివాఁ డనిపించుకొనె. తోడికోడాగాండ్రనుతనతో సరిగనడిపించె. చేఁబట్టినపనికి గట్టో మెట్టో చూచు; సగము చేసి పీఱిడివలె జాఱవిడఁడు. చేయుట కెదురుచూచు; వచ్చుబడికి నోరు చాపఁడు; దండుగకు తల్లడిల్లఁడు; గుఱుతు తప్పిపోఁడు. చూపునకు పేదవాఁడు; చేఁతకుఁ బెద్దవాఁడు. తప్పొప్పుల నిరసించు; తనతప్పు చెప్పిన దిద్దుకొనును; ఎదుటితప్పులు దిద్ద జంకఁడు; కానిమాటల కొప్పుకొనఁడు. పైవారి మేలునకయి పాటుపడును; చేఁతలలోనే నడత చూపును; లోఁటున్నఁ గప్పిపుచ్చఁడు; మొగమెప్పునకు మోమిాయఁడు. పైవారికి చాలి తేఁడు; తనకు తెచ్చువారిని జూచి యేవగింపడు. అక్కఱవడిన తాను మఱిగిపోవు. తనవలన నెరికి నొప్పికలుగ రాదనును; తప్పు లెంచకుండ తగు సాయము చేయుమనును; చెడ్డవారినిగూడ చేరదీయుమనును; చేతి నిచ్చుటే వారిచెట్టల మాన్పించు మేటితెలివనును; తాను వడినట్లు పొంది వన్నె కెక్కితి ననును.

పెట్టున కెదురుచూడఁడు; పొట్ట నింపవలె ననఁడు; వస్తువడినను పట్టుతప్పఁడు; బ్రతుకుటకు బలుసాకు చాలుననును. బడుగునేలనైన వండలేననఁడు; బులువుల కిచ్చగింపఁడు; ఒకరొందుచున్న సెగ్గింపఁడు; తనకు లేదని తగ్గిపోఁడు; పొరుగువారి కున్న పోవును.

ఒడుదొడుకులకు కన్నీరునింపఁడు; కయిత - తనివి - నిక్కము అను ముక్కలుములచే ఎల్లెడఁ బొంగుచుండు. పాడికై పట్టుపట్టును. కుంగు ఎఱుఁగఁడు. జందెము విడఁడు; జన్నియలోమునుఁగఁడు. ఇంటిపట్టుననుండ నేర్చుకొను; అడవిపట్టు మన్నించుచు విడిపట్టును పాటించు. దయ్యె మొక్కడని తలంచు; చీలికమతముల చెంతఁ జేరఁబోఁడు; వాని రోయకుండ నుండఁగలఁడు. మేలిమెఱుఁగులఁ దండ్రిని మెప్పించె. తనపేరును పలునాడుల పాడింపఁగలిగె.

ఏండ్లు దాఁటినను పదిమంది పని కనినఁ బడుచువానివలె పరుగులిడుచుండు. తాను మొదట పడమట పొడమినను తూర్పునాఁడే నెలవుగ నమ్ముకొనె. ఇక్కడివారు ఇతని తెలివికంటి వెలుంగున నిక్కమును జూడఁగలిగిరి. ఎల్లరు "అయ్యవా"రను గుర్తు మనినుంచుకొనిరి. మేలుమఱువమికి వేయినూటపదునార్లు మన్నన కానుక నొసంగి పేరుపొందిరి. తండ్రితోడఁ గలిసి యిచ్చిన దీవనవూల పొంది మేలుకాంచిరి. నేఁడు తెనుఁగునాఁ డంతయుఁ గలిసి అఱువదేండ్లపండుగ చేయ సమకట్టె; వారి కెల్లతేఁడు తోడ్పడుఁగాక!

---

# తృతీయ భీమవరం తాలూకా గ్రంథాలయ మహాసభ, చినఅమిరం, 2-3-1935.

పల్లెటూరి ప్రజలలో విజ్ఞానప్రచారమునకు గ్రంథాలయము లొనర్పగల అనితరసాధ్యమగు సహాయమును వివరించుచు స్థానికసంస్థలును, ప్రభుత్వమువారును గ్రంథాలయవ్యాప్తికి వలయు సహాయ మొనర్పవలెనని కోరుచు భీమవరంతాలూకా గ్రంథాలయ సభయందు

తీర్మానము లొనర్చబడెను.

గత ఆదివారం పగలు 2 గంటలకు చినఅమిరం గ్రామములో శ్రీ గంగేశ్వరానందగ్రంథాలయమున గుంటూరుజిల్లావాస్తవ్యులు రావుసాహేబు శ్రీయుత వఠ్యం భోగప్పశాస్త్రిగారి యాజమాన్యమున ఈసభ జయప్రదముగా జరుపబడెను.

ఆనాటిసభకు తాలూకాగ్రామాదులనుండి గ్రంథాలయప్రతినిధులును, అభిమానులును 150 మంది విచ్చేసిరి. శ్రీ సర్దారు దండు నారాయణరాజుగారు ఈ మహాసభను ప్రారంభించిరి. గ్రంథాలయ ప్రచారము ప్రప్రథమమున ఈ తాలూకాసంఘము వారు ప్రారంభించి రనియు, దేశమునం దెచటను ఈ యుద్యమముయొక్క పేరే లేని నలువదిసంవత్సరములకు పూర్వమే శ్రీ భూపతిరాజు తిరుపతిరాజుగారు గ్రంథాలయప్రచారమును చేయుచున్నారనియు, వారు వయోవృద్ధు లగుటచే యువకులు వారిస్థానమలంకరించి ప్రచారము చేయవలెననియు, గ్రంథాలయప్రచారమే దేశసేవ యనియు, మానవసేవ యనియు మొదలగు సంగతులతోడను గ్రంథాలయోపయోగమును గురించియు వారి సహజగంభీరోపన్యాసములో చెప్పిరి. పిమ్మట అధ్యక్షులు ఆధ్యాత్మికతత్త్వమును గ్రంథాలయోద్యమములో సమన్వయపరచి యువజనవిద్యావశ్యకతనుగూర్చి అనిర్గళవాఙ్మయములో ప్రబోధించిరి.

తరువాత, జటావల్లభుల పురుషోత్తంగారు, శ్రీ పుచ్చా వెంకటామయ్యగారు ప్రకృతిఆహారనియమములగురించియు, శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్యగారు గ్రంథాలయోపయోగములను గూర్చియు, గ్రామపరిశ్రమలను గురించియు, శ్రీ ఓరుగంటి వెంకటసుబ్బయ్యగారు ఆధ్యాత్మికతత్త్వమును గురించియు ఉద్బోధించిరి. స్త్రీలకు ప్రత్యేకసభ యేర్పాటుకావించి స్త్రీవిద్యను గురించియు సంఘసంస్కరణను గురించియు పలువురు ఉపన్యసించిరి. పిమ్మట మహాసభ వారిచే నీదిగువ తీర్మానము లేకగ్రీవముగా ఆమోదించబడినవి.

### తీర్మానములు.

1. యువనామసంవత్సరమునకు కార్యనిర్వాహకవర్గ సభ్యులకు 13 గురను ఎన్నుకొనిరి. అందు, శ్రీయుతులు భూపతిరాజు తిరుపతిరాజుగారు అధ్యక్షులు; దంతులూరి రామరాజుగారు ఉపాధ్యక్షులు; పా. సత్యనారాయణశర్మగారు కోశాధికారి; వేగేశిన సూరపరాజు, అకులసత్యనారాయణగార్లు కార్యదర్శులు.

2. తాలూకాగ్రంథాలయసంఘముయొక్క 1934-35 సంవత్సర జమ ఖర్చులు ఆమోదించిరి.

3. ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమమునకు ఎక్కుడు సహకారిగా నుండి కీర్తిశేషులయిన శ్రీ ఆరెకపూడి రామశాస్త్రుర్లుగారు, నందూరి జానకిరామయ్యగారు, మునిస్వామినాయుడుగారు, అభయంకరుగారు, విద్వాన్ గిద్వానిగార్ల నిర్యాణమున కీ సభవారు విచారించుచు వారికి శాశ్వత బ్రహ్మలోకనివాస మిప్పించగలందులకు భగవంతుని ప్రార్థించుచున్నారు.

4. ఇదివరకు గ్రంథాలయములను నిర్వహింపకున్న గ్రామపంచాయతీలు వారిగ్రామములలో నూతన గ్రంథాలయములను స్థాపించుటకును గ్రామములో గ్రంథాలయము లున్నచో నట్టి గ్రంథాలయములకు విరాళసహాయము

చేయుటకును తాలూకాలోని అన్ని గ్రామ పంచాయితీలను ఈసభవారు కోరుచున్నారు.

5. గ్రామపంచాయితీ గ్రంథాలయములకు వార్తాపత్రికలను తెప్పించుకొని తదీగ్రత్యా విషయములను గ్రహించు నవకాశము గ్రామస్థుల కివ్వగలందులకు గవర్నమెంటువారిని ఈ సభవారు కోరుచున్నారు.

6. ఆంధ్రదేశ గ్రంథాలయపత్రమున వెలువడుచున్న గ్రంథాలయసర్వస్వమును తాలూకాలోని అన్ని గ్రంథాలయములు తెప్పించుకొని ఉదారవిరాళము లొసంగి గ్రంథాలయోద్యమ విజ్ఞానమునకు తోడ్పడగలందులకు ఈసభవారు గ్రంథాలయములను కోరుచున్నారు.

7. గ్రామములయందలి విద్యావ్యాప్తికి ప్రాథమికపాఠశాలలు ఏవిధముగా పనిచేయునో అంతకంటె ఎక్కువగా గ్రంథాలయములు విద్యావ్యాప్తిచేయునుగాన జిల్లాబోర్డుల వారు గ్రామగ్రంథాలయములకు విరివిగా విరాళముల నిచ్చియు, గ్రంథాలయములు లేని గ్రామములలో గ్రంథాలయములను నెలకొల్పియు గ్రంథాలయాభివృద్ధి కలుగజేయగలందులకును ఈసభవారు జిల్లాబోర్డులవారిని కోరుచున్నారు.

8. గ్రామములయం దుండు సహకార పరపతిసంఘములయందు ఏర్పడు సాముదాయిక ఫండు అంతయు ఆయా గ్రామ గ్రంథాలయముల కిచ్చునట్లు తీర్మానించగలందులకు ఆయా గ్రామ సహకార పరపతిసంఘములను ఈ సభవారు కోరుచున్నారు.

9. గ్రామములోని సహకార పరపతి సంఘములలో సాముదాయిక ఫండు ఆయా గ్రామములలో గ్రంథాలయములకు విరాళముగా నిచ్చుటకు గ్రామ సహకార పరపతిసంఘములకు అవకాశ మివ్వగలందులకు శ్రీరిజిస్ట్రారు వారిని కోరడమైనది.

10. రాష్ట్రీయప్రభుత్వమువారు ఇచ్చు గ్రాంటులవలన కొను గ్రంథములను విద్యాశాఖాధికారుల యనుమతి అవసరమనుట అన్యాయ మని ఈ సభవారు నిర్ణయించుచు అట్టి అనుమతి లేకుండ బహిష్కరింపబడిన పుస్తకములను తప్ప నుతే పుస్తకములనైనను వారు కొనుటకు అధికార మిచ్చునట్లుగా ప్రాత జి. ఓ. లను మార్పు చేయించగలందులకు ప్రభుత్వమువారిని కోరుచు అట్టి బహిష్కార పుస్తకముల జాబితాను అన్ని గ్రంథాలయములకుచితముగా పంపించగలందులకు ఈ సభవారు కోరుచున్నారు.

11. 1860 సం. 21 చట్టముప్రకారము గ్రంథాలయములను రిజస్టరుచేయించుటకు చెల్లించవలసిన ఫీజు రు 50-లను తీసివేయవలసిన దని ప్రభుత్వమువారిని ఈసభవారు కోరుచున్నారు.

12. ఈ తాలూకాలో గ్రంథాలయములు లేని గ్రామములకు గ్రంథములు అందుబాటు చేసి జ్ఞానవ్యాప్తికి తోడ్పడుట మూలముగా గ్రంథాలయోద్యమము వ్యాపింపచేయుటకు ప్రస్తుత మున్న గ్రంథాలయములు పాటుపడవలె నని యీ సభవారు కోరుచున్నారు.

13. గ్రామములయందున్న జనులలో నూటికి 90 మందికంటె నెక్కువమంది విద్యాగంధము ఎరుంగనివా రగుటచేత అట్టివారి కందరికిని జ్ఞానవ్యాప్తి కలుగునటుల చేసికొననిది దేశాభ్యుదయమునకు సోపానము ఏర్పడజాలదు. కావున గ్రంథాలయము లన్నియు ఈ క్రింది సాధనముల నవలంబించెద రని ఈ సభవారు కోరుచున్నారు.

i చెవికి వినుపించునట్టియు కంటికి చూపునట్టియు మార్గములమూలమున జ్ఞానవ్యాప్తి చేయుట.

ii మహాపురుషుల వర్ధంతులు, జాతీయపండుగలు, పోటీపరీక్షలు పెట్టి వివిధరకముల జనులు గ్రంథాలయోపయోగమును పొందునటుల చేయుట.

iii సంచార గ్రంథాలయ పేటికల మూలమున గ్రంథాలయ ప్రచారము చేయుట.

14. ఈ తాలూకాయందు గ్రంథాలయోద్యమవ్యాపకమునకై ఒక సంచార గ్రంథాలయ శకటమును సంపాదించుటకై తీర్మానించడమైనది.

15. ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము రిజిస్టరీఅయినది గనుక ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమునకు చేసిన తచ్ఛాఖలగు తాలూకా గ్రంథాలయ సంఘములును, అందులో చేరిన గ్రామ గ్రంథాలయములును రిజిస్టర్డు గ్రంథాలయములుగ పరిగణింపగలందులకు ప్రభుత్వమువారి నీ సభవారు కోరుచున్నారు.

16. 1935 జూన్ మాసమున తాలూకా గ్రంథాలయసంఘముతరఫున ఆంధ్రరత్న, గోపాలకృష్ణయ్య వర్ధంత్యుత్సవమును, శ్రీయుతులు భూపతిరాజు తిరుపతిరాజు, సాగి వెంకట నరసింహరాజు, అల్లూరి రామకృష్ణంరాజు, అల్లూరి రామరాజు గార్ల షష్టిపూర్తియుత్సవములును జరుపవలె నని యీసభవారు తీర్మానించుచున్నారు.

17. రాయలసీమ క్షామనివారణకు సహాయార్థము గ్రంథాలయసేవకు లందరు ధాన్యము, గడ్డి, ధనము వసూళ్లుచేసి తాలూకాసంఘము వారికి పంపగలందులకు ఈ సభవారు కోరుచున్నారు.

18. ఆంధ్రరాష్ట్రమును వెంటనే మదరాసు రాజధానినుండి విభజింపకపోవుట అటుండ, జయపురం, బరంపురం, జలంత్రా మొదలగు ఆంధ్రప్రాంత్యప్రదేశములను ఒరిస్సాలో గలుపుట అన్యాయమనియు ఆంధ్రప్రదేశములను ఒరిస్సానుండి విడదీయవలసినదనియు వెంటనే ఆంధ్రరాష్ట్రమును విభజించి ఆంధ్రాభ్యుదయమును కల్పింపవలసినదనియు ప్రభుత్వమువారిని ఈ మహాసభవారు కోరుచున్నారు.

---

# భీమవరం తాలూకా గ్రంథాలయ సంఘము

## తృతీయ వార్షికనివేదిక - 1934-35.

ఈ తాలూకా గ్రంథాలయ సంఘము ది 12-8-1933 న వుండిగ్రామములో ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘకార్యదర్శిగా రగు శ్రీయుత అయ్యంకి వేంకటరమణయ్య పంతులుగారి అధ్యక్షతను జరుపబడిన గ్రంథాలయమహాసభలో ఏర్పాటు కాబడినది అప్పటినుండియు నీ సంఘము తగురీతిగా పరిశ్రమచేయుచు గ్రంథాలయ ప్రచారము చేయుచున్నది. ద్వితీయవార్షికసభ కుముదవల్లి గ్రామంలో శ్రీయుత సర్దార్ దండు నారాయణరాజుగారి అధ్యక్షతను జరుపబడినది. చినఅమిరంగ్రామంలోని శ్రీ గంగేశ్వరానంద గ్రంథాలయమువారి ఆహ్వానముపై నీ తృతీయ వార్షిక సభ 24-2-35 తేదీన జరుపబడినది.

ఈ సంఘములో 28 గ్రంథాలయములవారు మాత్రమే సభ్యత్వమును కలిగియున్నారు. ది 1-9-1934 మొదలు 17-9-1934 వరకు శ్రీయుత అయ్యంకి వేంకటరమణయ్య పంతులుగారి ఉత్సాహముచేతను మా సంఘ అధ్యక్షులగు శ్రీయుత భూపతిరాజు తిరుపతిరాజుగారి కార్యదీక్ష, కృషివల్లను గ్రంథాలయయాత్ర జయప్రదముగా జరుపబడెను. ఈయాత్రలో 84 మైళ్లు కాలినడకను నడిచి, 38 గ్రంథాలయములను దర్శించి గ్రంథాలయప్రచారము చేసిరి. ప్రతి గ్రామములోను కొత్తపల్లి నారాయణరాజుగారి భజనబృందము వారిచే హరిభజనచేయుచు నగర సంకీర్తనానంతరము పురసభ నేర్పాటుచేసి అందు గ్రంథాలయావశ్యకతనుగూర్చియు, వాని యుపయోగమును గూర్చియు శ్రీయుతులు అ. వేంకటరమణయ్య పంతులుగారు, వావిలాల గోపాలకృష్ణయ్యగారు, వర్యం భోగప్పశాస్త్రులుగారు మొదలగు యాత్రికులు ఉపన్యాసము లిచ్చి అత్యుత్సాహముతో పని చేయుటకు యువకులను ప్రబోధించి గ్రంథాలయములు నడుపు మార్గములను వారికి నేర్పిరి. ఈ గ్రంథాలయ యాత్రలో శ్రీ వేంకటరమణయ్యపంతులుగారు చూపిన పట్టుదల, శ్రద్ధ, కార్యదీక్ష వర్ణనాతీతములు. ఒక్కొక గ్రామములో మొదట గ్రామస్థులు ఉత్సాహములేక అసహాయత చూపినపుడు శ్రీ రమణయ్య పంతులుగారు సత్యాగ్రహము పూని భజనచేయుచు గ్రామమంతయుదిరుగుచు, యువకులు వచ్చి గ్రంథాలయమును స్థాపించిన ఆ గ్రామము విడిచెద ననియు, భోజనము గ్రంథాలయస్థాపనానంతరమే యనియు ప్రబోధించుచు నొక్కొక్కరోజున భోజనము లేకయే గడపిరి. ఇట్టి శ్రద్ధతోను పట్టుదలతోను ఉత్సాహముతోను పనిచేయుచున్న శ్రీ రమణయ్యపంతులుగారిని చూచి, తదితరయాత్రికులు ద్విగుణీకృతోత్సాహముతో యాత్ర అంతయు జయప్రదముగా జరిపిరి.

ఈ సంవత్సరమున 5 గ్రంథాలయములు 1 గరగపర్రు 2 పుప్పాలూరు 3 పునుదుర్రు 4 కొండేపూడి 5 గొరగనమూడిగ్రామములలో స్థాపించబడినవి. బొత్తుగా చెడిపోయిన కొన్నిగ్రంథాలయములు పునరుద్ధరించబడినవి.

తాలూకాలోని 90 గ్రామములలో 47 గ్రామములలో మాత్రమే గ్రంథాలయములు గలవు. ఈ గ్రంథాలయములను అభివృద్ధిచేయుటయు, మిగిలిన గ్రామములలో స్థాపించుటయు జరుగవలసియున్నది. గ్రంథాలయముల ఆవశ్యకతనుగురించి, ఉపయోగములనుగురించి బోధించుటకుగాను గ్రంథాలయోద్యమాభిమానులు పలువురు గ్రంథాలయ ప్రచారము చేయవలసియున్నది. ఈ గ్రంథాలయములద్వారా గ్రామస్థుల వ్యాపారిక, ఆర్థిక, భౌతిక, ఆధ్యాత్మిక అభివృద్ధికి పాటుపడవలెనని యీ సంఘము వారి ఆశయము. ఈ గ్రంథాలయములలో ఎక్కువ నవలలు, పద్యకావ్యములు, కథలు వగైరా లున్నవిగాని, భౌతికజ్ఞానము పారిశ్రామికజ్ఞానము, దేశచరిత్రములు మొదలగు ప్రపంచికవిద్యను అనగా ఏవిద్యవలన ప్రపంచజ్ఞానము కలిగి ఆర్థికాభివృద్ధి కలుగునో అట్టి జ్ఞానమును పెంపొందించుటకు తగిన అవకాశములు ఈ గ్రంథాలయములలో తక్కువ. కనుక నీ గ్రంథాలయములు ప్రజాబాహుళ్యమునకు ఉపయుక్తము కావలయునన్న శాస్త్రజ్ఞానము లిచ్చు పైవిధములగు గ్రంథములను తెప్పించియుంచవలెను. గ్రంథములు తెప్పించినంతమాత్రమున జ్ఞానము కలుగనేరదు. ఈ గ్రంథములను ప్రతివ్యక్తియు స్త్రీపురుషభేదములేక చదువునేర్పాటు

చేయవలసియున్నది. ఈ గ్రంథములను చదువుకొన్నవారిచే చదివించియు, చదువురానివారికి చదివి వినిపించియు ఏర్పాట్లుచేయవలయును. ఏనాడు అట్లు గ్రంథాలయములను ప్రతిమనుష్యుడును ఉపయోగించి విజ్ఞానమును సంపాదించి ఆజ్ఞానమును ఆచరణలో పెట్టునో ఆనాడే గ్రంథాలయములు తగురీతిని సేవచేయుచున్నవిగా గ్రహించవలెను.

ఈ దినములలో, దుర్భరఆర్థికదుస్థితిలో స్వయంసహాయముననే ఈ పని యంతయు మనమందరము చేయవలసియున్నది. ఇది యొక గొప్పపని కాదు. గ్రామమునకు ముగ్గురు సేవకులు గ్రంథాలయములకు సహకారమొనర్చినయెడల నిది యంతయు నెరవేర్చవచ్చును. శాస్త్ర గ్రంథములను కొనుటకు సొమ్ము కావలెను. అన్నిగ్రంథాలయములకు సొమ్మును చేకూర్చగల శక్తి లేకపోవచ్చును. అందువలన తాలూకా గ్రంథాలయ సంఘముతరపున కేంద్ర గ్రంథాలయమును స్థాపించి తద్ద్వారా అట్టి గ్రంథాలను గ్రంథాలయములకు సప్లయిచేయునట్లు తాలూకాలోని ప్రజలు అందరును పూనుకొనవలయును. రష్యాదేశములోని గ్రంథాలయములు ఏ విధముగా విద్యాభివృద్ధిని కలుగజేసినవో ఆ దేశచరిత్రను చూచిన తెల్లమగును. 10 సంవత్సరములలో నూటికి 95 మంది విద్యలేని స్థితియందుండి నూటికి 90 మంది విద్య కలిగినవారైరి. వ్యవసాయము నూతనశాస్త్ర విధానముగా లక్షలాది యెకరముల విస్తీర్ణము మీద వ్యవసాయము వృద్ధినొందినది. కనుక స్వయంకృషిమీద గ్రంథాలయములద్వారా అభివృద్ధి చూపించగలందులకు గ్రంథాలయములవారిని ప్రార్థించుచున్నాము.

మానవసేవకంటె ఎక్కువ ధర్మము లేదు. గ్రంథాలయసేవ మానవసేవలో ఒకపాదము. పునాదివంటిది గనుక ఈగ్రంథాలయాభివృద్ధి యువకుల ధర్మముగా గ్రహించి యీతాలూకా గ్రంథాలయసంఘమువారికి యువకులు ఎక్కువగా తోడ్పడగలందులకు కోరుచున్నాను.

యువకులు చాలమంది కాలము వృథాపుచ్చుచున్న సంగతి మీ కందరకు విశదమే. జరిగిన నిమిష మొకటైనను మనకు తిరిగిరాదు. నిమిష నిమిషము యువకత్వము నశించిపోవుచున్నది.

తిరిగి యీ అవకాశము మనజన్మలో కలుగదు. పశుపక్ష్యాదులవలె భోగవిలాసములలో కాలము గడపిన నిరర్థకము గనుక మానవసేవను అందు గ్రంథాలయసేవను చేయగలందులకు కోరుచు మీరు ఈరోజుననే యీవిషయమున ప్రతిజ్ఞ తీసికొనగలందులకు మిక్కిలి వినయముతో ప్రార్థించుచున్నాను.

నూతన సంవత్సరమున కేంద్ర గ్రంథాలయమును స్థాపించు ఏర్పాటు చేయగలందులకు తాలూకావాసులను ప్రార్థించుచున్నాను.

తాలూకా గ్రంథాలయసంఘము.

1934—35 సం॥ జమాఖర్చుపట్టి.

| జమ | రు. |
|---|---|
| చందాలు | 26— 0—0 |
| వెనుకటి సం॥ చిట్టానిల్వ | 17—15—9 |
| వెరసి | 43—15—9 |
| ఖర్చులు | రు. |
| తపాలా | 7— 2—3 |
| అచ్చు | 8— 0—0 |
| కాగితము వగైరా | 1—10—0 |
| ప్రయాణము | 5— 5—0 |
| ఇతరబాపతు | 9— 6—6 |
| నేటికి చిట్టానిల్వ | 12— 8—0 |
| వెరసి | 43—15—9 |

పాలకోడేటి సత్యనారాయణశర్మ,
కార్యదర్శి, 1—8—35.

# రేపల్లె తాలూకా గ్రంథాలయ సంఘము

# కార్యదర్శి నివేదిక. 1933–34.

ప్రజాసామాన్యమున కుపకరించు నీదేశీయోద్యమమునందునను మన తాలూకా ఇంతవరకు వెనుకంజవేసి యెఱుంగదు. ఇక వేయబోదు కూడను. ప్రప్రథమమున ఆంధ్రరాష్ట్రమున గ్రంథాలయోద్యమము బ్రహ్మశ్రీ సూరి వెంకట నరసింహంపంతులుగారిచే ప్రారంభింపబడు నప్పటికే మన తాలూకాలో కొన్ని గ్రంథాలయములు స్థాపింపబడినవి. 1915 సం॥ ప్రాంతమున ఆంధ్ర రాష్ట్రగ్రంథాలయ సంఘమువారిచే నియమింపబడిన రేపల్లె తాలూకా గ్రంథాలయ కార్యదర్శిగా రున్నట్లును, వారిచే కొంత ప్రచారము చేయబడినట్లును తెలియుచున్నది. తరువాత కొన్ని నూతన గ్రంథాలయములు స్థాపింపబడి 1920-21 సం॥ వరకు బాగుగ పనిచేసినవి. పిమ్మట కొంతమందముగానైన ఆంధ్రరాష్ట్రమంతటితో పాటు మన తాలూకాయందును గ్రంథాలయములు పనిచేయుచునే యున్నవి.

మరల కొంతకాలమునకు గ్రంథాలయోద్ధారక అయ్యంకి వేంకటరమణయ్యపంతులుగారి కృషివలన నుద్యమము పునరుద్ధరింపబడినది. మండల సంఘములు, తాలూకాసంఘములు, ఏర్పరుపబడినవి. మన మండలమున శ్రీయుతులు ఊటుకూరి వెంకటసుబ్బారాయశ్రేష్ఠిగారి యధ్యక్షతను ప్రచారము ప్రారంభింపబడినది. 1933 వ సంవత్సరమున ఎనిమిదవ మండల మహాసభ 'తెనాలి' తాలూకా 'అమృతలూరు' గ్రామమున శ్రీయుతులు మాగంటి బాపినీడు చౌదరిగారి యధ్యక్షతను జయప్రదముగా జరుపబడినది. ఆసభకు 'కనగాల శ్రీ జాతీయ బాలభారతీ గ్రంథనిలయము' వారు నన్ను ప్రతినిధినిగా పంపియుండిరి. ఆసమయమున నన్ను మండలసంఘమువారు మన తాలూకా కార్యదర్శిగా నియమించియుండిరి.

తరువాత ఏప్రియల్ మాసములో బెజవాడయందు జరిగిన అఖిలభారత గ్రంథాలయ మహాసభకు శ్రీయుతులు కస్తూరి కుటుంబరావు పంతులుగారిని (కనగాల) గ్రంథాలయము వారు ప్రతినిధిగా బంపియుండిరి. ఆ సభలను ప్రదర్శనములను వీక్షించి వచ్చి వారు స్వయముగా కృషిసల్పి నూతనముగా గ్రంథాలయ ప్రదర్శనము నొకదానిని తయారుచేసిరి.

7-6-1933 తేదీన మంతెనవారిపాలెము గ్రామములో శ్రీయుతులు ఊటుకూరి వెంకటసుబ్బరాయశ్రేష్ఠిగారి యధ్యక్షతను ప్రథమ రేపల్లె తాలూకా గ్రంథాలయమహాసభ జరుపబడినది. శ్రీయుతులు ప్రొఫెసర్ గోగినేని రంగనాయకులుగారు సభకు ప్రారంభోత్సవము గావించిరి. ఆ సభవారిచే శ్రీయుతులు కస్తూరి కుటుంబరావుగారి యధ్యక్షత నొక సంఘమేర్పరుపబడినది. తదాది నేటివరకమితోత్సాహముతో సంఘమువా రుద్యమప్రచారమునర్చి తాలూకాప్రజల కృతజ్ఞతకు పాత్రులైరి.

ఈ వత్సర మధ్యమమున సంఘమువారి కృషివలన 4 నూతన గ్రంథాలయములు స్థాపింపబడినవి. 5 పూర్వగ్రంథాలయములు పునరుద్ధరింపబడినవి. తాలూకాలో నున్న 30 గ్రంథాలయములలో 20 గ్రంథాలయములు సక్రమముగ నూతనోత్సాహముతో బనిచేయుచున్నవి.

మిగత పది గ్రంథాలయములును ముందు సంవత్సరమున జరుగు ప్రచారమువలన బాగుపడగల వని యాశించుచున్నాను.

ఇట్లు పునరుద్ధరింపబడవలసిన గ్రామములలో ఓలేరు, పల్లెకోన, భట్టిప్రోలు, కావూరు ముఖ్యమైనవి. నాలుగును పెద్దగ్రామములు. విద్యావంతు లనేకులు గలరు. కావూరులోని 'భారత సేవక మండలి' యను గ్రంథాలయమునకు, కొంత భూవసతియు నేత్రపర్వ మొనర్చు నొక రమణీయ భవనమును కలవు. గ్రంథాలయాభిమానము కూడ కొంత కలదుగాని అది యాచరణయందు లేకపోవుటయే లోపము. ఇకముందైనను కావూరు గ్రామవాసులు తమ గ్రంథాలయముల నుపయోగించుకొని యితరగ్రామములవారి కాదర్శప్రాయు లగుదురని విశ్వసించుచున్నాను. ఇట్లే ఓలేరు, పల్లెకూన, భట్టిప్రోలు, గ్రామములలోని దేశాభిమానులును, భాషాభిమానులును, తమ తమ గ్రంథాలయములను పునరుద్ధరింపజేసికొని శ్రీ భారతీదేవికి ప్రేమపాత్రు లగుదురని నమ్ముచున్నాను.

తాలూకాసంఘమువారు ఈ సంవత్సర కాలమున తాలూకా నంతను, రెండు, మూడు పర్యాయములు సంచారము గావించి గ్రంథాలయములవారిని ప్రోత్సహించియుండిరి. మన తాలూకాయందు గ్రంథాలయప్రదర్శనమును 16 పర్యాయములు ప్రదర్శించిరి. తెనాలి, బాపట్లతాలూకాలయందుకూడ 6 ప్రదర్శనముల గావించిరి.

అవకాశము కలిగినపుడెల్ల సంఘాధ్యక్షులైన శ్రీయుతులు కుటుంబరావు పంతులుగారు ఉపన్యాసరూపమున తమయనుభవములను, గ్రంథస్థమైన కొన్నిముఖ్యవిషయములను తాలూకాలకు తెలియజేయుచు, తాలూకాయందంతను ప్రచార మొనర్చిరి. 'నల్లూరు' లోని గ్రంథాలయము వీరి ప్రత్యేకకృషివలన పునరుద్ధరింపబడి యింతవరకు జయప్రదముగ శాస్త్రీయపద్ధతులపైన నడుపబడుచున్నది. ఇంచుమించు తాలూకాయందన్ని గ్రంథాలయములు వీరికృషిఫలితములు కొలదిగనో, గొప్పగనో, పొందిన వనియే చెప్పవచ్చును.

సంఘమువారు 4 దఫాలు సమావేశమై ముఖ్యవిషయములను చర్చించి తీర్మానించిరి. సంఘమువారు గ్రంథాలయములవద్ద నుండి మాసమున కొక పర్యాయము నివేదిక నొకదానిని తెప్పించుచున్నారు. దాని నింతవరకు నే కొలది గ్రంథాలయములవారో పంపుచున్నారు. కాని యందరును సరిగ పంపుట లేదు. గ్రంథాలయపరిస్థితుల దెలిసికొనుటకది సహాకారి కాగలదు గాన దాని యవసరమును గ్రంథాలయపాలకులు గుర్తించి సరిగ, సకాలమునకు కార్యాలయమునకు పంపవలసి యున్నారు.

---

# చదువదగిన కొన్ని పుస్తకములు....

( వావిలాల గోపాలకృష్ణయ్య, సహాయకార్యదర్శి, ఆంధ్రదేశగ్రంథాలయసంఘము, సత్తెనపల్లి).

అనేకమంది మిత్రులు, ఆంగ్లము రాని ఆంధ్రులు రాజకీయ పరిజ్ఞానమును బడయుటకు అనువగు ఆంధ్రగ్రంథములు కలవా! యని కోరిరి. ఆంధ్రమున అధికమగునట్టి గ్రంథములు కలవని ఒకరిద్దఱకు మనవి జేసియే యుంటిని. కాని అంతటితో, సంతృప్తిజెందక యట్టిదానిజాబితాను ప్రకటింపరాదా? యని కోరిరి. అట్టిదానికై ఎంతో అన్వేషణము గావించి కొంత పరికరమును ప్రోగు జేసితిని.

వివిధ దేశభాషలయందు అనేకవిద్యాపీఠము లేర్పడి రాజకీయపరిజ్ఞానమును, చరిత్రను, సమాజశాస్త్రమును తమతమ భాషలయందు నేర్పుచున్నారు. అట్టి సంస్థ ఆంధ్రదేశమున లేకపోవుట చాల లోటని మనవి చేయక తప్పదు. అట్టి వివిధ విద్యాపీఠములవారును తమతమ దేశభాషలయందుమాత్రమే విద్యగరపక ఆంగ్లమునందున్న ఆధునిక రాజకీయ సాంఘిక చారిత్రికములగు గ్రంథముల నన్నిటిని నిర్బంధముగ జదువునటుల చేయుచున్నారు.

అటులగాక నాయభిమతమును ననుసరించి అన్ని రాజకీయాంశములును ఆంధ్రముననే సామాన్యప్రజలకును, ప్రత్యేకాంగ్లభాషాధ్యయనమునకు కావలసిన కాలమును వినియోగింప నగత్యము లేకుండనే అందుబాటులో నుండవలయునని తలంచితిమి. అట్టి విద్యాలయము నేర్పాటు జేసిన బాగుండెడిదనియు అది అంతసులభసాధ్యమనియు దోచదు. 1918వ సంవత్సరములో ఆంధ్రదేశగ్రంథాలయసంఘమువారు బెజవాడయందు ప్రత్యేకోపన్యాసములు 15 దినములు నిర్వహించి వివిధవిజ్ఞానమును ప్రజ్వరిల్లజేయ ప్రయత్నించినదేమి, తాడేపల్లిగూడెం తాలూకా బోర్డువారు 1928వ సంవత్సరములో అన్ని పాఠశాలల ఉపాధ్యాయులను రప్పించి తాడేపల్లిగూడెమునందు వసంతఋతు పాఠశాల నేర్పాటు గావించి వివిధ శాస్త్రవిశారదులచే నిప్పించిన ఉపన్యాసము లేమి, శ్రీరామదాసు కో-ఆపరేటివ్ ఇన్‌స్టిట్యూట్ వారి ఆదరణమున 1931వ సంIIరం నిర్వహింపబడిన గ్రామపునర్నిర్మాణశాఖవారి 6 నెలల వివిధవిషయిక విద్యాబోధనశాలయొక్క ప్రయత్నమేమి, 1934వ సంవత్సరము వేసంగిలో శ్రీరామానీడు రైతాంగ విద్యాలయమువారిచే నిర్వహింపబడిన ఉపన్యాసపరంపరయేమి ఆంధ్రులహృదయములందు కొంత ప్రకోపమును, రాజకీయవిజ్ఞాన తృష్ణను గలుగజేసినదే కాని విజ్ఞానమును సమకూర్చిన దనజాలముగదా. ఇందులోని శ్రీరామదాసు కో-ఆపరేటివ్ ఇన్‌స్టిట్యూట్ వారి గ్రామపునర్నిర్మాణ తరగతులు స్కూలుఫైనలు లేక అంతకు సమమగు పరీక్షలలో గడతేరినట్టియు, తత్తుల్యమగు ఆంగ్లాంధ్ర భాషావిశారదత్వమును బడసినవారికే యుద్దేశింపబడెను. వారికే ప్రవేశ మొసంగబడెను.

అందువలన నిరంతరము స్థానికమగునట్టియో, లేక పరిసరమగునట్టియో గ్రంథాలయము సాహాయ్యముననో, లేక మరి యేవిధముననో విజ్ఞానసముపార్జనమునకు ప్రయత్నించు విద్యార్థుల కాధారభూతముగ నుండుటకు దగు పఠనీయమగు గ్రంథావళియుండుట కొంత ఉపయోగకారిగకూడ నుండునను విశ్వాసము నిత్యము అధికమగుచున్నది.

ఇంటివద్దనే యుండి విజ్ఞానము బడయవలయునని తలంచినవారిని ప్రోత్సహించు నుద్దేశముతోడనే ఆంధ్రభారతీతీర్థ (ఆంధ్రపరిశోధకసభ్య

విద్యాలయము) వారు విజయనగరము గృహవిద్యా పరీక్షల నిర్వహించిరి గాని అంత జయప్రదము కానేరకపోయెను. అనగా పరీక్షోత్కృష్ట అత్యల్పముగ నున్నదనియు, విజ్ఞానతృష్ణ బహుళముగ గలదనియు బోధ పడుచున్నది. గ్రంథముల నెవరికి వారు చదువుకొనుటయే మంచి ప్రధానమనియు, తదభివృద్ధికి దగు దోహదముగ నప్పుడప్పుడట్టి విద్యార్థులచే పోటీ ఉపన్యాసముల నేర్పచిన గొంత ప్రయోజనకారిగ నుండగలదేమో యనియు తోచినది.

అందుకై అట్టి అభిప్రాయముతో జదువ దలంచిన విజ్ఞానాభిలాషులకు సూచనగ నుండగలందులకు గాను ఒక అంశమున కవికాని, లేక విషయవిభజనము గావించికాని లేక సూచనమాత్రముగ గొన్ని ఉపయుక్తముల గ్రంథావళి నిట నొసంగ బ్రయత్నింతును.

గ్రంథావళి నిచ్చుటలో ఆంధ్రుల చరిత్ర, భారతదేశచరిత్ర, వివిధదేశముల చరిత్ర, రాజకీయములు, రాజ్యాంగనిర్మాణములు, రాజ్యాంగములు మొదలగు నన్ని సందర్భములను నవలోకించిననే కాని సామాన్యవిజ్ఞాన మలవడదు. అలవడిన, దానికి పునాది యుండదు. అందుకై ఈ క్రిందిగ్రంథముల నుదాహరించుచున్నాను.

## పుస్తకములు.

౧ ఆంధ్రుల చరిత్ర - (౩ భాగములు) చిలుకూరి వీరభద్రరావుగారు, కొవ్వూరు (ప. గో.)

౨ హిందూమహాయుగము - కొమర్రాజు వేంకటలక్ష్మణరావుగారు } విజ్ఞానచంద్రికా గ్రంథమాల, బెజవాడ.

౩ మహమ్మదీయ మహాయుగము ,,

౪ బౌద్ధమహాయుగము - వేలూరి సత్యనారాయణగారు,

౫ భారతీయుల అధినివేశము - (ఆంధ్రప్రచారిణీ గ్రంథ నిలయము, కాకినాడ.)

౬ ఆంగ్ల రాజ్యాంగ నిర్మాణచరిత్ర - గోటేటి కనకరాజుగారు

౭ ప్రభుత్వము - గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు, నంద్యాల

౮ వోటు ,,

౯ అమెరికా సంయుక్తరాష్ట్రములు - అయ్యదేవర కాళేశ్వరరావుగారు

౧౦ ఫ్రెంచి స్వాతంత్ర్యవిజయము ,,

౧౧ తురుష్క ప్రజాస్వామిక ప్రభుత్వము ,,

౧౨ చీనాయువజనోద్యమము ,,

౧౩ అధినివేశస్వరాజ్యము - దిగవల్లి వేంకటశివరావుగారు

౧౪ దక్షిణాఫ్రికా ,,

౧౫ సహకార వస్తునిలయోద్యమము ,,

౧౬ భారతదేశపు రైల్వే - శ్రీరాజా వాసిరెడ్డి సదాశివేశ్వర ప్రసాదబహద్దర్

(౯–౧౬) విజ్ఞానచంద్రికాగ్రంథమండలి, బెజవాడ.

౧౭ అర్థశాస్త్రము - మామిడిపూడి వేంకటరంగయ్యగారు } ఆంధ్రవిశ్వకళాపరిషత్, విశాఖపట్నము.

౧౮ అర్థశాస్త్రోపన్యాసములు ,,

౧౯ ఆంగ్లదేశ చరిత్ర - (లాంగుమన్సుకంపెనీ),

౨౦ ప్రపంచభూగోళము - ముదియం సీతారామారావుగారు మదనపల్లి
౨౧ రాజనీతిశాస్త్రము - వేపా సత్యనారాయణగారు, శారదా పబ్లిషింగ్ కంపెనీ, 185 మౌంట్ రోడ్, చెన్నపురి.
౨౨ పన్నులు - కొచ్చర్లకోట సత్యనారాయణమూర్తిగారు (?)
౨౩ అర్థశాస్త్రము - (౨ భాగములు) కట్టమంచి రామలింగారెడ్డిగారు
౨౪ రాజ్యతంత్రము (రెండు సంపుట.) వల్లూరి సూర్యనారాయణరావుగారు కొవ్వూరు (ప.గో.)
౨౫ ప్రాచీనహిందూదేశరాజ్యాంగచరిత్ర - కోన వెంకటాద్రియశర్మగారు (వావిళ్ళ)
౨౬ హిందూదేశార్థికశాస్త్రము - వేపా సత్యనారాయణగారు (వావిళ్ళవారు)
౨౭ ద్రవ్యశాస్త్రము - యద్దనపూడి వేంకటరత్నముగారు, తాడేపల్లిగూడెం
౨౮ పారిశ్రామికశాస్త్రము - ముదియం సీతారామరావుగారు, మదనపల్లి
౨౯ హిందూదేశైశ్వర్యచరిత్ర-ఎన్.వి రంగాచార్యులుగారు, మాంబళం, సైదాపేట,మదరాసు
౩౦ ప్రాచీనహిందూదేశమునందలి ప్రజాప్రభుత్వము - వి. యస్. శర్మగారు (?)
౩౧ ప్రాచీన హైందవ ప్రజాస్వామిక ప్రభుత్వము - దేశభట్ల లక్ష్మీనరసింహంగారు
౩౨ స్వాతంత్ర్య లక్షణము - ఓగేటి వెంకటసుబ్బయ్యశాస్త్రిగారు
౩౩ పారిశ్రామికహిందూదేశము - ముదియం సీతారామారావుగారు
౩౪ రైతు-రాజ్యాంగ సంస్కరణసంఘము-కల్లూరి రామచంద్రమౌళిగారు, మోపర్రు తె.తా.
౩౫ నానానాదేశ రాజ్యాంగములు ,,
౩౬ హరిజనసమస్య - నండూరి వేంకటకృష్ణమాచార్యులుగారు
౩౭ ఆధునిక రాజ్యాంగసంస్థలు - ఆచార్య, గోగినేని రంగనాయకులుగారు
౩౮ మానవహక్కులు - కె. గురునాధంగారు
౩౯ మహారాష్ట్రచరిత్ర - చిల్లరిగె శ్రీనివాసరావుగారు
౪౦ గ్రామపునర్నిర్మాణతరగతుల ఉపన్యాసములు-శనివారపు సుబ్బారావుగారు, కొవ్వూరు
౪౧ శాసనసభలు - చెరుకువాడ వేంకటనరసింహంగారు
౪౨ స్వరాజ్యదర్పణము ,,
౪౩ స్వదేశసంస్థానములు - నార్ల వెంకటేశ్వరరావుగారు
౪౪ కాంగ్రెసుచరిత్ర - శనివారపు సుబ్బారావుగారు
౪౫ కాంగ్రెసుచరిత్ర - చావలి వేంకటకృష్ణయ్యగారు
౪౬ సైమన్ కమీషన్ నివేదిక - వాణీప్రెస్
౪౭ చీనాదేశచరిత్ర - బెతపూడి భగవంతరావుగారు, ప్రవర్ధనీసంఘమువారు, బందరు
౪౮ జపానుదేశచరిత్ర - ,,
౪౯ జపానుదేశచరిత్ర - నండూరి మూర్తిరాజుగారు
౫౦ హైందవ స్వరాజ్యము - గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు, నంద్యాల
౫౧ సత్యాగ్రహతత్త్వము - దిగవల్లి వేంకట శివరావుగారు, బెజవాడ

౫౨ భారతదేశఋణములు - ముదిగంటి జగ్గన్నశాస్త్రిగారు, పల్లెటూరి గ్రంథమండలి
౫౩ సత్యాగ్రహము - దిగవల్లి వేంకటశివరావుగారు
౫౪ అంతర్జాతీయ ధర్మశాస్త్రము - వల్లూరి సూర్యనారాయణరావుగారు
౫౫ హిందూదేశచరిత్ర - మామిడిపూడి వెంకటరంగయ్యగారు
౫౬ జమీన్ రైతు - రెబ్బాప్రగడ మందేశ్వరశర్మగారు
౫౭ సహ్రానివేదక - వోగేటి వెంకటసుబ్బయ్యశాస్త్రిగారు
౫౮ అక్బరునాటి ఢిల్లీసామ్రాజ్యము - ఆంధ్రపత్రికా కార్యాలయము
౫౯ ఢిల్లీ దర్బార్ - కొమర్రాజు వెంకటలక్ష్మణరావుగారు
౬౦ శివాజీచరిత్ర - ,,
౬౧ తరుణ హిందూదేశము - ఖండవల్లి రాజారావుగారు
౬౨ మానవ స్వత్వములు - ౨ (ఆంధ్రపత్రికా కార్యాలయము
౬౩ హిందువుల ఆధిక్యము - దాసు దామోదరరావుగారు
౬౪ ప్రాచీనాంధ్ర నౌకాజీవనచారిత్రము - భావరాజు వేంకటకృష్ణరావుగారు
౬౫ ప్రాచీనవిద్యాపీఠములు - చిలుకూరి నారాయణరావుగారు
౬౬ అర్థశాస్త్రపాఠములు - మానికొండ సత్యనారాయణశాస్త్రిగారు
౬౭ జీర్ణవిజయనగరచరిత్ర - చిలుకూరి వీరభద్రరావుగారు
౬౮ మనకీదారిద్ర్యమేల - దేశరాజు రామచంద్రరావుగారు
౬౯ సంస్థానికత్రయము - కే. గురునాథరావుగారు
౭౦ ఖద్దరు పరిశ్రమ - భోగరాజు పట్టాభిసీతారామయ్యగారు
౭౧ కెన్యా భారతీయులు - తల్లాప్రగడ రామారావుగారు
౭౨ గుంటూరుమండల గ్రంథాలయ సంఘకరపత్రములు
౭౩ అసహాయోద్యమ విజయము - మాడభూషి వేదాంతం నరసింహాచార్యులుగారు
౭౪ ఓటర్ల కర్తవ్యము - చెలికాని లచ్చారావుగారు
౭౫ ఖిలాఫతుచరిత్ర - నబ్నివీసు సత్యకేశవరావుగారు
౭౬ ప్రాచీన భారతగ్రామపాలన - ముదిగంటి జగ్గన్నశాస్త్రిగారు
౭౭ ప్రాచీన వస్త్రవ్యాపారము - రెబ్బాప్రగడ మందేశ్వరశర్మగారు
౭౮ ప్లేటోగారి రాజనీతిశాస్త్రము - మల్లాది వేంకటరత్నముగారు
౭౯ బక్సారుయుద్ధము - మొసలకంటి సంజీవరావుగారు
౮౦ భారతస్వరాజ్యయుద్ధము - గాడేపల్లి సూర్యనారాయణశర్మగారు
౮౧ భారతస్వాతంత్ర్యము - కోన వేంకటప్రియశర్మగారు
౮౨ శాసన తిరస్కారము - గోవిందరాజు వేంకటకృష్ణారావుగారు
౮౩ సహాయనిరాకరణము - భోగరాజు పట్టాభిసీతారామయ్యగారు
౮౪ స్వాతంత్ర్యదర్శనము - దుగ్గిరాల రామమూర్తిగారు

౮౫ సహాయనిరాకరణోద్యమతత్త్వము - రంగాచారి సరస్వతి
౮౬ సూరతు కాంగ్రెసు
౮౭ స్వరాజ్యమే శరణ్యము - (ఉపేంద్రశ్రీచరణాలయం)
౮౮ సంపచ్ఛాస్త్రము - కె. సీతారామయ్యగారు
౮౯ సంపచ్ఛాస్త్ర సంగ్రహము - ,,
౯౦ హిందూదేశార్థికశాస్త్రము - తల్లాప్రగడ సూర్యనారాయణరావుగారు
౯౧ వైదికసభ్యత - పాలడుగు శేషాచార్యులుగారు
౯౨ ప్రభుత్వము - శనివారపు సుబ్బారావుగారు
౯౩ రాజ్యాంగశాస్త్రము - ,,
౯౪ రీసెటిల్ మెంటు - (కృ. గో. జిల్లా రైతుసంఘము)
౯౫ రాటము - మగ్గము - ఉన్నవ లక్ష్మినారాయణగారు
౯౬ సహకార యూనియన్‌లు - కొడాలి ఆంజనేయులుగారు
౯౭ సామ్రాజ్యతత్త్వము - కళా వేంకటారావుగారు
౯౮ రిజర్వుబ్యాంకి - కాశీనాధుని మల్లిఖార్జునరావుగారు
౯౯ హిందూమహాయుగము - మల్లంపల్లి సోమశేఖరశర్మగారు
౧౦౦ దానబోధ - కొణకంచి చక్రధరరావుగారు
౧౦౧ ఆంధ్రవీరులు - మల్లంపల్లి సోమశేఖరశర్మగారు
౧౦౨ ఆంధ్రవీరులు - (రెండుభాగములు) శేషాద్రిరమణకవులు
౧౦౩ వేదనిలయము - మానికొండ సత్యనారాయణశాస్త్రిగారు
౧౦౪ ముప్పదియిద్దరు తెలుగుమంత్రులు - కనపర్తి మార్కండేయశర్మగారు
౧౦౫ అళియరామరాయలు - చిలుకూరి వీరభద్రరావుగారు
౧౦౬ అమ్మ - ఆదర్శగ్రంథమండలి
౧౦౭ కమ్యూనిస్టు కరపత్రములు
౧౦౮ సామ్రాజ్యవాదము - లెనిన్
౧౦౯ డివేలరా - గద్దె లింగయగారు (ఆదర్శగ్రంథమండలి యలమర్రు)
౧౧౦ గారిబాల్డీ జీవితము - శరణు రామస్వామి చౌదరిగారు
౧౧౧ గ్రీసుదేశచరిత్ర - గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు, ఎమ్. ఎ., నంద్యాల
౧౧౨ రోమనుచరిత్ర - పొన్నాడ సుబ్బారావు - ఆంధ్రవిజ్ఞాన భానూదయ గ్రంథమాల
సోంపేట, గంజాంజిల్లా
౧౧౩ చరఖాశాస్త్రము - ఎర్నేని సుబ్రహ్మణ్యంగారు, స్వరాజ్యప్రెస్, బెజవాడ
౧౧౪ ఇండియా రాజ్యతంత్రము - జె. గురునాథం, ఉన్నవ లక్ష్మినారాయణగారు
౧౧౫ భారతస్వరాజ్యయుద్ధము - గాడిపర్తి సూర్యనారాయణ శర్మగారు, పల్లెటూరి
గ్రంథమండలి, తణుకు

౧౧౬ సిక్కులచరిత్రము - పోడూరి లక్ష్మీనరసింహంగారు, ఆంధ్రభాషాభివర్ధనీసంఘము, బందరు
౧౧౭ సూరత్ కాంగ్రెస్‌చరిత్ర - దేశాభిమానీప్రెస్, గుంటూరు
౧౧౮ ఢిల్లీసామ్రాజ్యము-కాళ్ళకూరినారాయణరావుగారు, సంపాదకుడు, మనోరంజని, కాకినాడ
౧౧౯ శుక్రనీతిసారము - పురాణపండ మల్లయ్యశాస్త్రిగారు, పిఠాపురము
౧౨౦ రయితు - భూమి - కిళాంబి వేంకట శ్రీనివాసాచార్యులు, బి. ఏ.,
౧౨౧ వారసత్వము - తెలుగు న్యాయ శాస్త్రగ్రంథమాల, రాజమండ్రి
౧౨౨ కాంగ్రెసు కాన్ఫరెన్సుల ఉపన్యాసములు - కృష్ణా స్వదేశీప్రెస్, బందరు.
౧౨౩ అక్బరుచరిత్ర - ఉన్నవ లక్ష్మీనారాయణగారు

షరా:—ప్రస్తుతము లభించిన చిరునామాలతోడను గ్రంథకర్తల నామములతోడను ఈమాత్రపు పట్టికను తయారు చేయగలిగితిని. మున్ముందువివరములతో ధరలతో చిరునామాలతో ప్రతి అంశమునకు సంబంధించిన గ్రంథముల పట్టికలను తయారుచేయ, బ్రయత్నించుచున్నాను. ఎవరేని సందర్భమున వివరములు తెలిపినను నాకు సత్తైనపల్లికి వ్రాసిన కృతజ్ఞుడను.

ఈ గ్రంథావళి నవలోకించిన నేమేని ప్రయోజనము గాన్పించినవారెవరైన నొందరుందురేని వారిద్దాని ప్రయోజనము నేవిధముగ గుర్తించిరో తెలిపిరేని ఇంకను నాయోపిన పరిశోధనంజేసి అవసరమగు అన్నివివరములతో నొక సమగ్రమగు గ్రంథావళిని బ్రకటింపగలను. అందులో గ్రంథము లభించు చిరునామాతోసహా ప్రచురింపగలను.

ఇందులో నుదహరింపఁబడిన గ్రంథములు అసలు లభింపవనియు, లభించు నవకాశమున్నను దుర్లభమనియు| అన్ని లభించినను లేక లభించినంతవరకైనను బడయవలయుననిన నే రెండుమూడుగందలరూప్యములో యుండవలయు ననియు నది దుర్ఘటము కాదాయనియు నాలోచనలేక నే నిట్టి గ్రంథావళిని దయారుచేయలేదని మనవి. అవకాశముండిన నన్నింటిని ఏవిధముగనైనను బడసి వానిని బఠింపవలయునను గోరికయు గ్రంథావళిని ప్రకటన చేయఁదలంచుటకు హేతువని మరల మనవిజేయ ననవసరమని తలంతును. నాకును ఇంతవరకును అన్నిగ్రంథములు లభింప నేరవు.

దీని ప్రయోజనము బడసినవారొకరు యిరువురేని యుందురేని ఈ నా పరిశ్రమకు ప్రతిఫలము లభించినదని ఆనందించగలను. ప్రయోజనము బడయుటయను నితరభావము దెలియని ఆంధ్రసోదరు డీ గ్రంథ పఠనమునఁ న దేశసేవకుఁ గడంగి స్వతంత్రాభిప్రాయమును విచ్చలవిడిగ వెలువడజేయుటయేయని విన్నవించుకొనుచున్నాను. ఇంతతో విరమింతు.

---

## —• కాకినాడ హోమియోపతీ పత్రిక •—

హోమియోపతీ మరియు బయోకెమిక్ చికిత్సలనుగూర్చియు, ఆరోగ్యాది విషయములను గూర్చియు అనుభవశాలురగు వైద్యులచే వ్రాయబడిన వ్యాసములు, క్లినికల్ కేసు రిపోర్టులు, మొదలగువానితో తెలుగునను, ఇంగ్లీషునను వెలువడునట్టి ఆంధ్రహోమియోపతీ మాసపత్రిక. ఇది ప్రతిగృహస్థునకును వైద్యునకునుగూడ నెక్కువ యుపయుక్తముగా నుండును.

సంవత్సరచందా రు 1-4-0 లు మాత్రమే. విడిపత్రిక రు 0-2-0 లు. ప్రకటనరేట్లు అతిస్వల్పము.

వలయువారు:—డాక్టరు వై. గణపతిరావు, సంపాదకుడు.
కాకినాడహోమియోపతీపత్రిక, కాకినాడ, అని వ్రాయవలెను.

విజ్ఞానచంద్రిక 41-42 వ కుసుమము.

అపూర్వగ్రంథము! త్వరపడుడు! కొలదిప్రతులుమాత్రమే!

# భారతదేశము-ఆర్థికచరిత్ర.

## Indian Economics in Telugu

గ్రంథకర్త:

శ్రీమాన్ ఆత్మకూరి గోవిందాచార్యులుగారు.

ఈ గ్రంథమున

రెండు సంపుటములు, 18 అధ్యాయములు, 419 వివిధవిషయములను గురించిన పట్టికలు, 18 చిత్రములు గలవు. రెండు సంపుటములు 2,380 పేజీలు.

ఈ గ్రంథమును పలువు రాంధ్రప్రముఖులు బహురీతుల శ్లాఘించిరి.

డాక్టరు. పట్టాభిగారి యభిప్రాయమేమి?

"...విషయసూచికచూచిన - ఒక్క భూగోళముకాదు-ఒక్క చరిత్రకాదు - ఈ ప్రక్క సహకారోద్యమము - అప్రక్క పరిపాలనావివరములు - మరియొకవైపున దేశముయొక్క ఆరోగ్యము - గ్రామపునర్నిర్మాణము - పిమ్మట రైతుల ఋణబాధ - రవాణా సాధనములు - యంత్రములు - దిగుమతులు - ఎగుమతులు - కళలు - నాణెములు - మారకము - ధరలు - బ్యాంకులు - రాజ్యాంగము - పన్నులు - జాతీయభాగ్య భోగ్యములు - మున్నగు వివిధవిషయము లీగ్రంథమునందు సంక్షిప్తముగను సమగ్రముగనుగూడ ఇముడ్చబడినవి...."

శ్రీయుత కట్టమంచి రామలింగారెడ్డిగారి యభిప్రాయము గమనింపుడు.

"...ఏభాషయందు గాని దీనికి తుల్యమైనట్టియు విపులమైనట్టియు గంభీరమగునట్టియు గ్రంథము మరియొకటి లేదు..."

దివాన్ బహదూర్ మోచర్లరామచంద్రరావు పంతులుగారు.

"...ఆంధ్రదేశమునందుగల కళాశాలలందును పాఠశాలలందును, ఇతర గ్రంథాలయములయందును, సహకార సంఘములు, బ్యాంకులయందును ఈపుస్తకమును ఉంచెద రని ఆశించుచున్నాను..."

ప్రతి గ్రంథాలయమును కొనదగిన పుస్తకము.

వెల రెండు సంపుటములు రు 10 లు మాత్రమే.

వలయువారు:—

ఆత్మకూరి గోవిందాచార్యులు, ఏలూరు.

అని వ్రాసిన బడయగలరు.

# ఏలూరు, అన్నదానసమాజము—Annadanasamajam Ellore.

ఏలూరు, అన్న, వస్త్ర, వైద్య, విద్యాదానసమాజము 1918 సం॥రము స్థాపింపబడెను. ప్రభుత్వమువారు స్థలము ధర్మముగా నొసంగిరి. మ॥రా॥శ్రీ బొమ్మా రత్నంగారి ద్రవ్యసహాయమున భవనము నిర్మింపబడెను. ఇందు ప్రతిదినము అశక్తులకు అన్నదానము జరుగుచున్నది ప్రతిసంవత్సరము 15 డిశెంబరున బీదలకు వస్త్రదానము జరుగుచున్నది. వేసవికాలమున మంచినీళ్ల చలివేంద్రిలు పెట్టబడుచున్నవి. వైద్యదానము ప్రతిరోజు సాయంకాలము సమాజమువద్ద జరుగుచున్నది.

ఒకరోజు అన్నదానమునకు రు 60 లు ధర్మమిచ్చిన స్థిరాస్తివల్ల వచ్చేఆదాతో వారు కోరిన తేదీ 1 రోజున బీదలకు అన్నదానము జరుగును. వస్త్రదానము శాశ్వతనిధి ధర్మము రు 10 లు లగాయతు ఈయవచ్చును. ధర్మములకు రశీదులును, శాశ్వతనిధి ధర్మములకు రసీదులతోసహా ఫోటోలను 5 గురు శాశ్వతధర్మకర్తలు (రు 500 దాతలు) సంతకములతో నిచ్చెదరు. ఎల్లరు సహాయపడ గోరుచున్నాము. ఇతర వివరములకు:—

శాశ్వతధర్మకర్తలలోనివారు:

- రావుబహద్దరు, మోతే గంగరాజు జమీందారుగారు
- కొత్తమాసు సీతారామయ్యగారు, (పోర్టుట్రస్టీలు)
- పసుమర్తి పురుషోత్తంగారు, (ప్రెసిడెంటు)
- మద్దుల వెంకట చినరాజుగారు, (వైస్‌ప్రెసిడెంటు)
- సన్నా గంగరాజుగారు, (వైస్‌ప్రెసిడెంటు)
- కంమల రామయ్యగారు, (సెక్రటరీ)

---

## యథార్థభారతి.

ఆధ్యాత్మ విద్యా విషయిక మాసపత్రిక.

ఇది శ్రీ వ్యాసాశ్రమస్థాపకులగు శ్రీమలయాళస్వాములవారి విచారణపై జరుగుచున్నది.

ఏ యథార్థజ్ఞానము వేదఋషులచే తెలుపబడెనో, ఏజ్ఞానము ఖండాంతరములచే నాదరింపబడెనో, ఏజ్ఞానము బంధవిమోచనకారియో, ఏజ్ఞానమునకు శమదమాది గుణములుగల మానవులందరును సమానాధికారము గలిగియుందురో; ఏజ్ఞానము కలిగిన సర్వప్రాణికోట్లకు శోకశాంతియు ఆనందప్రాప్తియు కలుగునో; ఏజ్ఞానము వేదముయొక్క సారమైయుండునో, ఏజ్ఞానమును పొందిన మరల జీవులు శోకము నొందరో, అట్టిజ్ఞానము తెలుపుటకే ఈపత్రిక వెల్వడెను. దీనియందు అనేక మహాత్ముల ఉపదేశప్రసంగములు ఉండుటయేగాక, శ్రీస్వాములవారి యాధ్యాత్మిక తత్వ ప్రబోధోపదేశములు గల్గియుండును. ఇది ప్రతియింగ్లీషు నెల 15 తేది వెలువడును.

సం॥ చందా రు 2-4. విదేశములకు రు 2.10

పుస్తకభాండాగారములకు, రు 2-0-0.

శ్రీవ్యాసాశ్రమము, యేర్పేడుపోస్టు. (చిత్తూరుజిల్లా.)

## వాణీగ్రంథమాల, రాజమండ్రి.

ప్రవేశరుసుము 0-2-0, చందాదారులకు ఒక్కొక్క పుస్తకము 0-4-0; ఇతరులకు 0-5-0; ప్రతి ఒక్కొక్కటి 120, 200 పేజీలు ఉండును. భాండాగారములకు ప్రవేశరుసుము లేదు.

వెలువడిన పుస్తకములు.

| | |
|---|---|
| 1. పల్లెటూరిపడుచులు (అనేకపత్రికలచే కొనియాడబడినది) | 0 4 0 |
| 2. చదువుకొనిభార్య | 0 4 0 |
| 3. చంద్రహారము | 0 4 0 |
| 4. భూగృహము | 0 4 0 |
| 5. తానాజీ (చక్కని చారిత్రికనవల) | 0 4 0 |
| 6. లీలావతి | 0 4 0 |

మొత్తము రు 1-10-0 లు పంపినవారికి పోస్టేజి ఉచితము. సం॥రం చందా రు 4-8-0; ఆరు మాసములకు రు 2-4-0 లు. వెంటనే చందాదారులుగ చేరుడు.

☛ ప్రతిచోట ఏజంట్లు కావాలి.

విజ్ఞానచంద్రికయందు ప్రకటింపబడిన

# హిందూ మహాయుగము

కొమర్రాజు లక్ష్మణరావు ఎం.ఏ. గారిచే రచియింపబడినది. వెల రు 1—8—0.

# బౌద్ధ మహాయుగము

వేలూరి సత్యనారాయణ ఎం. ఏ. గారిచే రచియింపబడినది.

వెల క్యాలికోబైండు రు 2—0—0
రేపరుబైండు రు 1—8—0

# జడకుచ్చులు

రాయప్రోలు సుబ్బారావుగారిచే రచియింపబడినది. వెల రు 1—0—0

మేనేజరు,
ఆంధ్ర గ్రంథాలయప్రెస్, బెజవాడ.

# ప్రకృతి

ఆరోగ్య సచిత్ర మాసపత్రిక.

ఆరోగ్యనియమములను - మందు, శస్త్రములతో నిమిత్తములేని స్వాభావిక చికిత్సావిధానములను, స్వాభావిక జీవనమును బోధించును. సంవత్సరచందా రు 3—0—0

మేనేజరు,
ప్రకృతి కార్యాలయట్రస్టు, బెజవాడ,

# జ్వాల మాసపత్రిక

బెజవాడ

విడిపత్రిక ఒక అణా - సం॥ చందా రూపాయి

శతాబ్దాల ఆచారం మానసిక బానిసత్వంగానూ, మతాభిమానం నల్లమందు మత్తుగానూ అయి, నిస్తేజంగా, నీరసంగా స్వతంత్రత ఏవిధంగానూ లేని సంఘానికి అలజడి, తిరుగుబాటు, సత్యాన్ని నిండుకన్నులతో చూడగలధైర్యం కావాలి. జ్వాల ఉద్దేశం ఇది.

# "విజయ" సచిత్రమాస పత్రిక.

సం॥ చందా రూ 1. విడి సంచిక 0–1–6.

హాస్యరసోపేతము విజ్ఞాన సర్వస్వము. ఒక చరిత్ర - ఒక రసము - ఒక పరిశ్రమ ఒక పరిశోధన - ప్రకటించినది ప్రకటించకుండా ప్రకటించేది "విజయ" ఒక్కటే. సంచికంతయు సచిత్రమే. ప్రతివిలేఖరియు సుప్రసిద్ధుడే. మిమ్ములను నవరసతరంగిణిలో ముంచెత్తుతుంది. ఇన్నివిషయములు చర్చించు పత్రిక యింత స్వల్పమూల్యమునకు చిక్కదు.

వివరములకు:—విజయ కార్యాలయము, విజయనగరం.

# హిందూసుందరి

ఇది కాకినాడ విద్యార్థినీ సమాజము (రిజష్టర్డు) తరపున ప్రతినెల వెలువడు మాసపత్రిక. దేశమందు—ముఖ్యముగా విద్యావిషయములో నితరదేశములకంటె మిక్కిలి వెనుకబడియున్న మహిళామణులకు విద్య ప్రబోధింప జేయుటయే యీపత్రికయొక్క ముఖ్యోద్దేశము. ఇది 29 సం॥నుండి ఆంధ్రమండలమందే గాక రాష్ట్రేతరాంధ్రులకును విశేష ప్రచార మొందుచున్నది. విద్యాసంస్థలను గూర్చిన వ్యాసములు, మనోరంజకములగు వివిధ పద్యగద్యవ్యాసములు, చక్కని కథలు భక్తి, నీతి, సత్ప్రవర్తనాది సదభ్యాసములు ప్రబోధించు విషయములు, ముఖ్యముగ స్త్రీలకు, బాలికలకు నిత్యోపయోగకరములగు పాకశాస్త్రము, ఇతర కళలు నేర్పుపాఠములు, నాటకములు, మహాత్ముల చరిత్రలు, మున్నగు ననేకవిషయములు ప్రచురింపబడుచుండును. సం॥ చందా రు ౨ మాత్రం.

వలయువారు: మేనేజరు, హిందూసుందరి, కాకినాడ.

# ఉదయిని. సాహిత్యపత్రిక.

సం॥ చందా రూ 4

'ఉదయిని' లో చక్కని కావ్యాలు, కథలు, నాటకాలు, హాస్యాలు, విమర్శవ్యాసాలు— అందమైనవీ, ఉత్కృష్టమైనవీ రచనలు ప్రకటితమవుతాయి.

'ఉదయిని' చదవడం మనస్సుకి ఆరోగ్యమూ, అలంకారమున్ను,

'ఉదయిని'వంటి పత్రిక తెలుగులో మరొకటి లేదన్నారు చదువుకొన్న రసజ్ఞులు.

కార్యాలయం: 15 ఆదెప్ప ముదలివీధి, వేపేరి, మద్రాసు

Grandhalaya Sarvasvam - Registered No M. 1714



# గ్రంథాలయ సర్వస్వము.

చందా: ఆంధ్రదేశగ్రంథాలయసంఘ సభ్యులకు సభ్యత్వచందాతో రు 3 లు మాత్రమే.
ప్రతినెల ౨౬-వ తేదీన వెలువడును.

## వ్యాసములు

గ్రంథాలయ శాస్త్రము-ఆంధ్రవాఙ్మయము-ఆంధ్రాభ్యుదయములను గూర్చిన అనుభవ పూర్వకములైన వ్యాసములు, గ్రంథాలయ సంఘములయొక్క నివేదికలు, వృత్తాంతములు, గ్రంథముల విమర్శనములు ఇందు ప్రకటింపబడును.

## పటములు

గ్రంథాలయ భవనములయొక్కయు, గ్రంథాలయ సభలయొక్కయు, గ్రంథాలయ సేవకులయొక్కయు, పటములును, ఆంధ్రాభ్యుదయ బోధకములగునట్టి పటములును ఇందు ముద్రింపబడును.

## గమనింపుడు

ఈ పత్రిక ప్రతినెల ౨౬-వ తేదీన వెలువడును. కావున వ్యాసములను పంపువారు ఏనెల పత్రికయందు ప్రకటింపవలెనో దానికి వెనుకటినెల 15-వ తేదీకి పూర్వమే పంపవలయును. పటములను వెనుకటినెల 1-వ తేదీకి పూర్వమే పంపవలయును.

## ప్రకటన రేట్లు

| | |
|---|---|
| ఒకసారి 1 పుటకు | రు 20-0-0 |
| ఒకసారి ½ పుటకు | రు 12-0-0 |
| ఒకసారి ¼ పుటకు | రు 6-0-0 |

రాజపోషకులు:— శ్రీరాజా వేంకట కుమారమహీపతి సూర్యారావు బహద్దరుగారు

శ్రీరాజా నాయని వేంకట రంగారావు బహద్దరుగారు
మద్దుల వేంకట చినరాజా శ్రేష్ఠిగారు, ఏలూరు.

బెల్లంకొండ రాఘవరావుగారు, అగ్రహారందారు
గోపు రామచంద్రరావుగారు, బెజవాడ.

వివరములకు:—గ్రంథాలయసర్వస్వకార్యస్థానము, బెజవాడ.

బెజవాడ, ఆంధ్రగ్రంథాలయ ముద్రాక్షరశాలయందు శ. కోదండరామయ్యగారిచే ముద్రింపబడినది.

# గ్రంథాలయసర్వస్వము

ప్రతిమాసమునను సచిత్రముగ వెలువడును

సంపు. ౯ ] **బెజవాడ** [ సంచిక ౨

నవంబరు ౧౯౩౫

సంపాదకుడు: అయ్యంకి వేంకటరమణయ్య

## ఊటుకూరి వెంకటసుబ్బరాయశ్రేష్ఠిగారి

# స్మారకసంచిక




వాయువు ఎల్లవారికి ఎట్లు స్వాధీనమై యున్నదో
జ్ఞానముకూడ అట్లు స్వాధీనము కావలయును
ఉదకము ఎల్లవారికి ఎట్లు సేవ్యమై యున్నదో
జ్ఞానముకూడ అట్లు సేవ్యము కావలయును
సూర్యచంద్రమండలముల తేజస్సు ఎల్లవారికి
ఎట్లు సౌఖ్యప్రదముగా నున్నదో అట్లే
జ్ఞానముకూడ సౌఖ్యప్రదము కావలయును

—చిలకమర్తి లక్ష్మీనరసింహము

వార్షికమూల్యము: సభ్యులకు రు ౩

ఇతరులకు రు ౫ విడిసంచిక పావలా